# పునర్మిలనం!

గారాబంగా పెరిగిన ఆ ఎనిమిదేళ్ళ అమ్మాయి అనుకోకుండా 'అనాథ' అయింది. దొమ్మరి ఆటగాళ్ళ ముఠాలో చేరి అలాగే పెరిగి పెద్దదయింది. ఆ దశలోనే అనుకోకుండా మళ్ళీ కన్న వారిని కలుసుకోగలిగింది. ఆ తర్వాత ఆశించని విధంగా కోటీశ్వరుల ఇంటికోడలూ అయింది... అలాంటి అదృష్టవంతురాలు మరి ఆత్మహత్యకు ఎందుకు పాల్పడింది?

'చతుర' ఫిబ్రవరి సంచికలో
డాక్టర్ కొర్రపాటి గంగాధరరావు
నవల 'పునర్మిలనం'
చదివి చూడండి.

నవలతోపాటు అదనంగా
అద్భుత చతుర ప్రపంచం,
నవ్వించే చతుర మినీ కతలు,
ఆకర్షణీయమైన నాలుగు
రంగుల చిత్రాలు 'చతుర'
ప్రత్యేకతలు.



ఆంధ్ర సచిత్ర వారపత్రిక

వ్యవస్థాపకులు
దేశోద్ధారక కాశీనాధుని
నాగేశ్వరరావు పంతులుగారు
స్థాపితం : 1908
శివలెంక శంభుప్రసాద్
సంపాదకుడు :
[1938 - 1972]
శుక్రవారం : 6 2 '81
రౌద్రినామ సం. మాఘ శు. విదియ
సంపుటము 74 సంచిక 21
సంపాదకుడు :
శివలెంక రాధాకృష్ణ
*
పోస్టులో ఏడాది చందా రు 54-60
ఆరు మాసాల చందా రు. 27-30
విడి ప్రతి వెల ఒక రూపాయి
ఆంధ్రపత్రిక కార్యాలయము
గాంధీనగరం, విజయవాడ-520 003

## విషయానుక్రమణిక

అట్టమీద బొమ్మ :
నటి సారిక
(ఫోటో : కాంతిలాల్ ఖత్రి)

లోకంపోకడ * డామెన్










# ఉత్తరాలు

## ముఖచిత్రం

2.1.81 తేదిన వెలువడిన వారపత్రిక అట్ట మీద బొమ్మ శ్రీరామారావు ముఖచిత్రం చాలబాగుంది. అందులో రాగంహారి సీరియల్ పేర్లు శ్రుతి—కృతి, పల్లవి, చరణ్ బాగా కుదిరినాయి.

ఎం. రామచంద్రన్ [నాగార్జునసాగర్]

* * *

అపరిచిత తారలను ముఖచిత్రాలుగా ప్రచురించడంలో ఆంధ్ర సచిత్ర వారపత్రికకొక ప్రత్యేక స్థానం ఉంది. ఉదాహరణకు 9.1.81 తేది ఆంధ్ర సచిత్ర వారపత్రిక ముఖచిత్రంగా వేసిన నటి ఎం. ఆర్. రాధికను నేను ఇదివరకు ఏ సినిమాలోను చూడలేదు. ఇకపోతే సీరియల్స్ రెండు ఆసక్తిదాయకంగా ముందుకు సాగుతున్నాయి.

మహ్మద్ జావిద్‌పాష [ అలంపూర్]

## కార్టూన్లు

23.1.81 తేదితో వెలువడిన సంక్రాంతిసంచిక ముఖ చిత్రం కార్టూన్‌గా వేసి ప్రచురించినందుకు థ్యాంక్స్. అన్ని పత్రికల్లా సంక్రాంతికి మా అభిమాన పత్రిక ప్రత్యేక సంచికగా వెలువడ లేదని కాస్త బాధగా ఉన్నా ఇందులో, మీరు ప్రచురించిన ప్రతి కార్టూన్ సంక్రాంతికి సంబంధించినదై ఉండి మాకు చాలాఆనందాన్ని కలిగించింది. కథలు రెండే అయినాచాలా బాగున్నాయి. సినిమాలో 1980 చిత్రాలు ప్రచురించినందుకు, నటి జయలక్ష్మి కలర్ స్టిల్ వేసినందుకు సంక్రాంతి శుభాకాంక్షలు.

ఎస్. అన్వర్ హుస్సేన్ (గిరింపేట)

* * *

తేది 23.1.81 మా ఆంధ్ర సచిత్ర వారపత్రికలో ప్రచురించిన ఎన్టీఆర్ గారి కార్టూన్లు, కాటూరిగారి కార్టూన్లు నవ్వువచ్చే విధంగా ఉన్నాయి. ముఖచిత్రం ఎంతో ఆకర్షణీయంగా ఉంది. అది వారం ఎప్పుడు వస్తుందా! పత్రిక ఎప్పుడు చదువుదామా అనేటట్లు ఉంటున్నాయి కథలూ, కార్టూనులు.

బి. సత్యనారాయణ, బి. మోహన్‌లక్ష్మి(విశాఖపట్నం)

## సామాన్యుని సణుగుడు

నటి ఎం. ఆర్ రాధిక ముఖచిత్రంతో వెలువడిన మా [మా] ఆంధ్రపత్రికలో [9.1.81] చల్లని మాట కథ బాగున్నది. వీరాజీగారి సామాన్యుడి సణుగుడు సైకిలెక్కగలవా? చాలచాల బాగుంది. అసలు మంత్రులు కార్లు వాడటం తగ్గించాలి. గవర్నమెంట్ ఆఫీసరులుకూడా జీపుల వాడకం తగ్గించాలి. గవర్నమెంటు జీపులు సినిమాహాల్స్ వద్ద కనపడకుండా చూడాలి.

కె. నరసింహారావు [కొండేపూడి]

6–2–1981 శుక్రవారం మొదలు
12–2–1981 గురువారం వరకు

# ★ వారఫలం ★

మేషం:— వ్యాపార విస్తరణకు అనుకూల కాలం. మీకు రావలసిన ధనం, చాలకాలంగా రాక నిలచినధనం, సమయానికి అందగలదు. ఆరోగ్య లోపం లేదు. భారీ వ్యాపార నిమిత్తంగా యింకా కొన్ని మార్పులు ఈరాశి వారు చేయవలసియున్నది. ఉద్యోగంలో, చాలమందికి క్రీడా వనిలో అనుకూలత గలదు. స్త్రీలకు: నూతనోద్యోగ ప్రయత్నాలు సాగి పోతాయి.

వృషభం:— రాశికి పంచమమున గల గ్రహాల వలన ఏదో శుభ కార్య విషయమై ప్రయత్నాలు జరుగనున్నారు. వ్యాపారం సుముఖంగా, ఒడి దొడుకులు లేక సాగిపోతుంది. తలచిన పనులు నిరాటంకంగా నెరవేరగలవు. సాహిత్య రంగంలో అనుకూలత చెప్పదగిన వారం. స్త్రీలకు: ముఖ్య బంధువుల రాక, నూతన విషయాలు తెలిసికొనుట సంభవం.

మిధునం:— ఆరోగ్యలోపం కనిపిస్తుంది. వయసు మీరిన వారు, రక్త సంబంధమైన వ్యాధితో, అజీర్ణవ్యాధితో బాధ పడవలసి వస్తుంది. అవుషధ సేవ, గ్రహజపం అవసరం కూడా. ఉత్తరాలమూలాన ముఖ్యవిషయాలు తెలిసికోగలరు. స్త్రీలకు: ఆరోగ్య లోపం, ధనలోపం, ఉద్యోగంలో యిబ్బందులు కనిపించగలవారం.

కర్కాటకం:— వ్యాపార లాభం సంభవం. వారం వారం జరిగే మీ వ్యాసంగంలో ప్రగతి కనిపిస్తుంది. ధనలాభం గలవారం. వ్యవహారంలో పరిష్కార మార్గ మున్నది. స్తోత్ర పాఠకులు వెంట పడుతారు. వారి మాటలకు తబ్బిబ్బు కాకోకండి. ఆరోగ్యం క్రమంగా అభివృద్ధి చెందగల మార్గ మున్నది. స్త్రీలకు: కళారంగంలో అవకాశం, వైజ్ఞానిక రంగంలో చొరవ గలవారం.

సింహం:— మీ సంభాషణ మిత్రులకు, బంధువులకు కటువుగా ఉంటుంది. రావలసిన ధనం అందక పోవటం, చేసిన ప్రయత్నం మరలా చేయ వలసి రావటం, అనానుకూల పరిస్థితులు, అన్ని రంగాలలో ఉండటం సంభవం. కడుపు నొప్పితో స్వల్పంగా బాధ పడటం, కొందరకు క్రీడారంగంలో అవకాశాలు లభించటం గమనించగలరు. స్త్రీలకు: కుటుంబ భారం, సంతానమును గూర్చిన యిబ్బందులు రాగలవు.

కన్య:— ముఖ్యబంధువుల రాక, తీర్థాటనం, ధనరాబడి, ఉద్యోగంలో అప్రయత్నానుకూలం, మిత్రుల మూలాన, ఉత్తరాల వలన, కొన్ని ముఖ్య విషయాలు తెలిసికొంటారు. ఇంకా కొంతకాలం మూరెడు ముందుకు పోయి, బారెడు వెనుకకు రావటం మానుకోండి. ఏ పనీ త్వరపడి చేయరాదు గదా! స్త్రీలకు: అప్రయత్న ధనలాభం, శుభ కార్యాన్ని గూర్చిన చర్చలు సంభవం.

తుల:— ప్రయత్నించిన ప్రతి వ్యవహారానికి ఆటంకాలు రాగలవు. ఆశించిన ధనరాబడి చెప్పవీలు లేదు. చేతికందిందాకా నమ్మకం లేదు. వ్యయ రాశిలో గల గురు, శనులు, అధిక వ్యయానికి దోహదం చేయగలరు. స్త్రీలకు: చాలమందికి యుక్త వయస్కులకు, శుభ కార్యప్రస్తావనలు ఉండగలవు.

వృశ్చికం:— మీ బంధు వర్గీయులు శుభ కార్య ప్రస్తావనలు తేగలరు. ఆరోగ్య లోపం కూడా కనిపించ గలదు. అందుకు తోడు ధనలోపం కనిపిస్తుంది. వయసు మీరిన వారికి ఆరోగ్యలోపం కనిపిస్తుంది. వ్యాపారం నూతనంగా చేయాలనే ప్రయత్నం క్రమంగా సాగేమార్గ మున్నది. స్త్రీలకు: నూతన వస్తు సేకరణ, వినోద యాత్రా సన్నాహం సంభవం.

ధనుస్సు:— దూర బంధువులు రాగలరు. అనేక విషయాలను గూర్చి చర్చలుంటాయి. వ్యాపారంలో ఎలాంటి యిబ్బందులు రావు. అప్పులివ్వటం, భారీ వ్యాపారంలో, జాయింటు వ్యాపారంలో అలక్ష్యంగా సంచరించటం తగదు. చాలమందికి క్రీడారంగంలో అవకాశాలు, ఉద్యోగంలో మార్పులు సంభవించ గలవారం. స్త్రీలకు: అన్ని రంగాలలో అభివృద్ధి కరమైన వారం.

మకరం:— చాలమందికి నూతనోద్యోగాలు లభించే అవకాశమున్నది. క్రమంగా అప్పులబెడద తీరి పోయే అవకాశమున్నది. ఆరోగ్యం క్రమంగా వృద్ధి చెందే మార్గమున్నది. కొందరకు తమ వారెవరో, పరాయివారెవరో తెలిసికోలేక తికమకలు పడుతారు. క్రీడా రంగంలో, రాజకీయరంగంలో చాలమందికి అవకాశాలుండ గలవు. స్త్రీలకు: అనారోగ్య సూచనలుంటాయి.

కుంభం:— వ్యాపారం బాగా సాగి పోతుందనిగానీ, వ్యవహార చిక్కులు విడి పోతాయని గాని, నూతనోద్యమం ఫలవంతం అవుతుందని గాని, ధనం రావలసినది అందుతుందని గాని, కొనదలచిన వస్తువులు సులువుగా అభిప్రాయనిగాని చెప్పవీలు లేదు. స్త్రీలకు: సాహిత్య కళారంగాలలో గౌరవం, సభా గౌరవం సంభవమని చెప్పదగిన వారం.

మీనం:— డబ్బు సమయానికి అందుతుంది. అయిన వారి మూలాన కొన్ని లాభదాయకమైన అవకాశాలు లభించగలవు. ఆత్రతతో ఏ పని ప్రారంభించకండి. అత్యాశకి వ్యాపార విషయంలో పోకోకండి. మీకు సంబంధించిన వస్తువులు పోతాయేమో! జాగ్రత్త! గృహ నిర్మాణ కార్యక్రమానికి దిగవచ్చు కాని, బాగా యోచించి దిగండి. స్త్రీలకు: వృత్తిలో శ్రమ, లాభించదగిన విషయాలతో నష్టం రాగల గ్రహస్థితి గలదు.

— విద్వాన్ కోట సత్యరంగయ్యశాస్త్రి



సీరియల్

# స్పందన

— మంథా వెంకట రమణారావు

31

( గత సంచిక తరువాయి )

తన దైనందిక జీవితం ఒక మూసలో పడి పోయినట్టయింది చంపాకి— ఉదయం లేవడం— స్నానం చేసి అమ్మకి వంటలో సాయం చెయ్యడం— తొమ్మిదికల్లా బట్టలు మార్చుకొని, అన్నం తిని స్కూలుకి కాలి నడకని బయల్దేరడం. పదిహేను నిముషాల్లో స్కూలు చేరుకుంటుంది ఏటెండెన్సులో సంతకం చేసి స్టాఫ్ రూమ్‌లో కూర్చొని తక్కిన ఉపాధ్యాయులతో, ఉపాధ్యాయురాళ్ళతో కబుర్లు చెప్పడం కన్న, వారు చెప్పుకొనే కబుర్లు వినడం... తరవాత ఏ క్లాసు పీరియడుంటే ఆ క్లాసుకి వెళ్ళడం— ఆరు, ఏడు, ఎనిమిది క్లాసులకి జనరల్ సైన్స్ చెప్పేపని తనకి ఒప్పగించేరు. సైన్సు పీరియడ్లు ఎప్పుడూ నాలుగు నించి ఆరో పీరియడ్‌ల మధ్యని పడతాయి కాబట్టి సాధారణంగా పన్నెండు వరకూ పని వుండదు— కాలం ఎలా గడపడం ? లైబ్రరీ నించి సాహిత్యం పుస్తకాలు తెచ్చుకొని చదివేది— స్కూలుకి వచ్చే సాహితీ మాస, వార పత్రికలు తిరగవేసేది— కొన్ని రచనలు మనసుకి హత్తుకొనేవి—అలా తనూ ఎందుకు రాయకూడదు. ఈ కరకు ప్రపంచం యొక్క నిజాలనించి, కాల్పనిక జగత్తులోకి ఎందుకు తప్పించుకపోరాదు తను ? ఒకనాడు ఈ ప్రపంచమంతా సుందర నందన వనంగా కనిపించింది తనకి— కోయిల కూత, కాకమ్మ అరుపూ, ఇంటి కిటికీ తలుపుల అద్దాలని పొడిచే పిచికల కిచకిచలు ఎంతో మధురంగా చెవికి సోకేవి. పూచిన మామిడి చెట్టు, పెరట్లో తులసికోట ముందు అమ్మ పెట్టిన దీపం, పండగనాడు అలంకరించి తేబడ్డ డూడూ బసవన్న, కాళీ పునాదుల మీద బాగోతంలోని సత్యభామ ఎంతో అందంగా అగపడేవి— అమ్మ పెట్టెలోని సిల్కుచీర ఎప్పుడైనా బయటకి తీసినప్పుడు దాని అందం, తాకినప్పుడు దాని మెత్తదనం, హారతి ఇవ్వబోయే ముందు కర్పూరం పొట్లం విప్పినప్పటి వాసన, బట్టలపెట్టె తెరిచి నప్పుడు, మంచి వాసన కోసం అడుగున ఏనాడో పడేసి ఉంచిన చందనం సబ్బు సుగంధం, వేసవిలో వెన్నెల రాత్రుల నాడు పైన పక్కవేసి పడుకున్నప్పుడు మల్లెపొద నించి వచ్చే పూల సౌరభం ఇవెంతో హాయి నిచ్చేవి.

ఇప్పుడు అంతా ఎంతో మారిపోయింది. తన మనసు ఎదిగిపోతోందో లోకం పాతబడుతోందో కాని ఆ స్పందన ఇప్పుడు మనసుకి ఎందుకు కలగటం లేదు ? ఎందుకో ఎంతో బరువుగా, విచారంగా ఉంటుంది— నాన్నా, అమ్మ ముసలవుపోతున్నారు— ఇల్లు ముసలిదయిపోయింది... రామం అన్నయ్య అక్కడే వుండిపోతున్నట్టు ఉత్తరం రాసేడు... ఎం. ఎస్ అయిపోయింది... పి హెచ్ డీ నో ఏదో చేస్తాట్ట... వీలయినప్పుడు పాతికా, యాభై డాలర్లు పంపుతాడు... లేనప్పుడు లేదు! అక్కడి ధరలూ పెరిగిపోతున్నాయట— కానీ లిల్లీ గురించి ఏ ఉత్తరంలోనూ రాయడు— లిల్లీ వెళ్ళగానే ఆమె ద్వారా పంపిన జోళ్ళు, తిరుబండారాలూ అందేయంటూ రాసేడు... తరవాత ఆమె సంగతే రాయలేదు— అమ్మకి సంగతి ఎంతో ఆనందాన్నిచ్చింది... ఆమెలో ఆశ చిగురించింది, రామం తిరిగి వచ్చేక ఆమె చూసి పెట్టిన సంబంధం చేసుకుంటాడని— కాని తిరిగి వచ్చే ఆశ తక్కువ అని తెలటంతో ఆమె ముఖంమీద నిరాశ రేఖలు చీకటిలా అలముకున్నాయి ముడతల రూపాన! ఇంక శ్రీను సరేసరి! ఎం. డీ. అయిపోయింది కాని ఇక్కడికి మరి తిరిగి రాలేదు.— అక్కడే ప్రాక్టీసు పెట్టేడు— పెద్ద ఇల్లు అద్దెకు తీసుకున్నాడు— హాస్పిటల్ పరికరాలు కొన్నాడు. ఒక కాంపౌండర్‌నీ, ఆయానీ, జీతానికి పెట్టేడు— కాని ఇంకా ప్రాక్టీసు పుంజుకోనందున వచ్చినదానికన్నా ఖర్చులే ఎక్కువవడాన తను ఇంటికి ఏమీ పంపే స్థితిలో లేనట్టు రాసేసేడు నిర్మొహమాటంగా! "వాడింక మన పిల్లడు కాడు! కొడుకుల్ని కని ఏం లాభించింది? ఆఖరికి ఆడపిల్లమీద ఆధారపడవలసి వస్తోంది!" అంటూ కంట తడి పెట్టుకుంది అమ్మ— ఇవన్నీ చంపా మనసు యొక్క ఆనందమనే వెలుగు మీద చీకటి నీడలను పరిచాయి— ఇంటికి తను చేరుకోగానే అమ్మా, నాన్నా ముఖంలో తనకి పెళ్లి చేసి పంపేయకుండా, ఉద్యోగం చేయిస్తూ, ఆ అర్జనమీద బతుకుతున్నామే అన్న బాధ—ఆ బాధని చూడలేక తన బాధ!

ఒక కన్య మనస్తత్వాన్ని చిత్రిస్తూ, ఒక చిన్న కథ రాసింది తన విశ్రాంతి కాలంలో

జరిగిన కథ–13 : చంప నాన్న కాశీపతి చాలీ చాలని జీతంతో ఆ ఇంటిని అలానే నెట్టుకొస్తుంటాడు చంప నాన్నమ్మకి వోపిక ఉన్నంత కాలమూ చాకిరీ చేయించుకొన్న కొడుకులూ, కూతుళ్ళూ ఆమెకు వోపిక తగ్గడంతో ఆమెను పోషించటానికి వంతులు పడ్డారు. "గతంలో తన కంపాస్ బాక్స్ దొంగిలించిన అప్పారావ్‌ని తన పుట్టినరోజు అని చెప్పి తన ఇంటికి నాన్న చెప్పగా ఆహ్వానిస్తుంది చంప. అనుకోకుండా అనేకమైన ఖర్చులు నెత్తిన పడడంతో ఇల్లుఅమ్మగా వచ్చిన తన వాటా మొత్తం ఖర్చయిపోతుంది. ఈలోగా చంపా పెద్దమనిషయి కూర్చుంటుంది. రామంని వైజాగ్ ఇంజనీరింగ్ కాలేజీలో చేర్పిస్తాడు నాన్న చంపా కాలేజీలో చేరుతుంది. తాము చేసుకున్న పెళ్లి ఒప్పందం ప్రకారం లాయర్ ప్రకాశరావు శ్రీనుని మెడికల్ కాలేజీలో చేరేట్లు చేస్తాడు. రామం, లిల్లీలు ప్రేమించుకొంటారు. రామం, లిల్లీల పెండ్లి అయిన తరువాత వాళ్ళు మూ[illegible]త్రకి వెళ్లి తిరిగి వస్తారు. తను చదువుకున్న స్కూల్లోనే ఉపాధ్యాయినిగా చేరుతుంది చంప శ్రీను, మీనాక్షిల పెండ్లి ఆడంబరంగా జరిగిపోతుంది లిల్లీ రామం దగ్గరికి చేరుకొంటుంది.

# 1950 కి ముందుగా మీరు జన్మించినట్లైతే ఈ ప్రకటన పూర్తిగా చదవండి.



## 10 కి 9 మంది ప్రజలకి 30 ఏళ్ళకి పైబడ్డ వారికి జుట్టు వూడటం సంభవిస్తుంది...మరి ఇది వారికి తెలియదు!

ఆ 9 మందిలో మీరు ఒక్కరైతే ప్యూర్ సిల్విక్రిన్ వాడటం నేడే ప్రారంభించండి.

మీ దువ్వెనతో మీ జుట్టును గట్టిగా దువ్వండి. మీ దువ్వెన మీదకి వెంట్రుకలు వచ్చినట్టయితే ఆనవాలు మీ జుట్టు వూడిపోతుందన్నమాట. మీరు వెంటనే—అంటే యిప్పుడే చర్య తీసుకోవాలి. లేకపోతే మీ జుట్టు పల్చనైపోయినట్టు మీకు అద్దంలో స్పష్టంగా కన్పించటం ప్రారంభిస్తుంది. ముఖ్యమైన ఎమినో ఏసిడ్‌లు జుట్టుకి సహజమైన ఆహారం. అవి కొరతైతే, జుట్టుపల్చబడిపోయి ఆరోగ్యం కోల్పోతుంది. వాటి కొరతని తొలగించక పోయినట్టయితే




జుట్టు వూడిపోతూనే వుంటుంది. అందుచేత మీరు ప్యూర్ సిల్విక్రిన్ వాడటాన్ని ఈరోజే ప్రారంభించటం అవసరం.

ప్యూర్ సిల్విక్రిన్‌లో ఏమిటి ఉంటాయంటే :

① పెద్దది చేసిన ఒక ప్యూర్ సిల్విక్రిన్ చుక్క సహజ జుట్టు అవసరాలని తీర్చేందుకు దేహం సమకూర్చే 17 ఎమినో ఏసిడ్‌ల అపూర్వ సమ్మేళనమే ప్యూర్ సిల్విక్రిన్.

ప్యూర్ సిల్విక్రిన్ ఎలా పని చేస్తుందంటే :

② లోపలకు చొచ్చుకు వెళ్ళే చర్య.

ప్యూర్ సిల్విక్రిన్ వెంట్రుకల మొదళ్లలోవరకు వెళ్ళేదాక దాన్ని తలమీద చర్మ భాగంలో యింకేట్టు బాగా మర్దనం చెయ్యండి. శాస్త్ర పరిశోధనలతో రూపొందించి ప్యూర్ సిల్విక్రిన్‌లో ఇమిడ్చిన ప్రక్రియ పద్ధతి యిప్పుడు పని చెయ్యటం ప్రారంభిస్తుంది ; మళ్ళీ జుట్టు పెరుగుదల కొనసాగేట్టు దోహదం చేస్తుంది. మీ జుట్టు మళ్ళీ యథా ప్రకారం ఆరోగ్యంగా పెరిగే వరకూ మీరు ప్యూర్ సిల్విక్రిన్‌ని రోజుకి రెండుసార్లు చొప్పున ప్రతి రోజూ వాడండి.




**ప్యూర్ సిల్విక్రిన్**

ఇప్పుడు కొత్త పేక్‌లో వస్తోంది.

OBM/5005/Tel



# స్పందన

చంపా– ఒక వారపత్రిక పోటీ ప్రకటించింది కథలకి– మొదటి బహుమతి వంద రూపాయలు! రెండో బహుమతి డెబ్బయి ఐదు– మూడో బహుమతి యాభై! కథకి పదో పదిహేనో పారితోషికం దొరికే ఆ రోజులలో అంతకి పదిరెట్లు బహుమతంటే పెద్ద మొత్తమే మరి! తను ఎప్పుడో రాసి ఉంచుకున్న ఈ చిన్న కథని, "కలలు–కన్నీళ్లు!" అన్న పేరు పెట్టి పంపింది. పంపాక ఆ సంగతే మరిచి పోయింది చంపా– ఒక రోజున ఆ పత్రిక నించి కవరు ఉత్తరం రాగా, ఆ కథ గురించే మరిచిపోయిన ఆమె ఏమిటా ఈ ఉత్తరం? అని కుతూహలంగా చింపింది– అందులో ఉన్న ఉత్తరాన్ని చదివినప్పుడు మొదట ఆమెకు అర్థంకాలేదు. అర్థం అయ్యాక ఆనందం ఎలా వెలిబుచ్చాలో అర్థం కాలేదు. ఉప్పెనలా ఆనందం ముంచుకొచ్చినపుడు దానికి పైకి పోయేమార్గం ఎలా చూపడం– వంటింట్లోకి పరుగునవెళ్లి, అమ్మని పెనవేసుకొని కేక పెట్టింది. "అమ్మా! నా కథకి మొదటి బహుమతొచ్చింది!"

అమ్మకిదేమీ అర్థం కాలేదు – "అంటే ఏమిటే?" అంటూ అడిగింది. "నేనో కథ పోటీకి పంపానమ్మా, వందరూపాయలు బహుమతి దొరికింది! నా ఫోటో పంప మన్నారు... వేస్తారట!" "వంద రూపాయలేనా!" అంది అమ్మ నిరుత్సాహంగా. ఆమెకు తను సాధించిన విజయం యొక్క ఔన్నత్యం కనిపించలేదు, వచ్చిన బహుమతి యొక్క చిన్న మొత్తమే తప్ప! నాన్న మాత్రం ఎంతో ఆనందించి, అభినందించేరు– తను పరుగున వెళ్లి ఇరుగు పొరుగు వారితో చెప్పగా వాళ్ళు తనకొచ్చిన డబ్బు ఎంత అడిగి నిరుత్సాహ పడ్డారు– "ఒక మంచి పట్టుచీరన్నా రాదు!" అన్నారు! తన ఆనందాన్నీ, విజయాన్ని సరైన విధంగా అర్థం చేసుకునే మనుష్యులు ఎవరూ కనిపించలేదు... ఒక్క అప్పారావు తప్ప! కాని అప్పారావుకీ కథలంటే తెలుస్తుందా? ముందుగా తన క్లుప్తమైన జీవిత విశేషాలతో ఏడాది క్రితం తీయించుకున్న ఫోటో కాపీ తగిల్చి ఆ పత్రిక వారికి పంపింది– **తన కథ చిత్తు ప్రతిని చదువుకొని ఆనందించింది–**

స్కూలుకి వెళ్తున్నప్పుడు అప్పారావు వర్క్ షాపులోకి వెళ్ళింది. రెండేళ్ళ కాలంలో అప్పారావు మెకానిక్ స్థాయి దాటి పోయి నాలుగు లారీల స్వంతదారుగా స్థిరపడ్డాడు— రూట్ బస్‌లు రెండు కొని లాభసాటి రూట్‌లో నడపడానికి ప్రయత్నాలు చేస్తున్నాడు — షాప్‌లో మరామతులు, ఓవరాలింగ్, సర్వీసింగ్, పెయింటింగ్ స్థాయి పెరిగింది— అందుకు కావల్సిన ఆధునిక యంత్రాలు కొన్నాడు. అంతేకాక ఆ స్థలమంతా కొనేసి ఒక మూలకి ఆఫీసుకని మూడు గదులు కట్టించేడు. లెక్కలూ, పద్దులూ చూడడానికి ఒక గుమాస్తాని పెట్టేడు. టెలిఫోన్ వచ్చింది. సవతి తల్లి కొడుకు ల్నిద్దర్నీ అభిమానించి గేరేజ్‌లో పెట్టేడు. వాళ్ళక్కడి మోటార్ మెకానిజమ్ పనులు నేర్చుకోవడమే కాక, పనులు పర్యవేక్షిస్తున్నారు. అంతేకాక అద్దె ఇంటినించి స్వంత ఇంటికి మారడం మరో విశేషం. వర్క్‌షాపుకి దగ్గరగా ఉన్న వీధిలో ఒక ఇల్లు అమ్మకానికి రాగా దాన్ని కొనేసేడు. ఇల్లు పాతకాలం నాటిదే కాని, ఇంటి ముందు చాలా జాగా ఉంది. ఇంటికి మరమ్మత్తులు చేయించడం; కరెంటు పెట్టించడం, ఇంటి ముందు గోడ కట్టించి తలుపుపెట్టి ఆ జాగాలో పూల తోట వేయించడం, ఇవన్నీ అప్పారావు ఆర్థిక పరిస్థితులు శుక్లపక్ష చంద్రుడిలా వృద్ధి పొందుతున్న చిహ్నాలు.

కాని అప్పారావు మాత్రం ఆ నూనె మరకల కాకీ దుస్తుల్లోనే ఉంటాడు పనిమీద ఉన్నప్పుడు. లారీల కింద దూరిపోయి, ఆ ఇంజన్‌కి వచ్చిన ట్రబులేమిటో కనుక్కొని, ఏం చెయ్యడమో మెకానిక్కులకి చెప్తాడు.

చంపా వెళ్ళేసరికి అప్పారావు ఆఫీసులో, టేబులుమీద కూర్చొని, లారీలకి ఎక్కడెక్కడ ఏ లోడ్లు ఉన్నవీకనుక్కుంటున్నాడు మర్నాటికి. చంపాని చూడగానే ముఖం మతాబాలా వెలగ్గా, చిరునవ్వుతో ఆహ్వానించి, టేబులు మించి లేచి, ఆమెకి కుర్చీ చూపించేడు. టెలిఫోన్‌లో మాట్లాడ్డం అయ్యాక అడిగేడు ... "ఏమండీ పంతులమ్మగారూ! ఏమిటి ముఖమలా సంతోషంతో వెలిగిపోతోంది ... పెళ్ళి సెటిలయిందా ?" —

"నా పెళ్ళి సెటిలయితే మరి నిన్ను చూడ్డం అంటూ ఉండదు ..." కుర్చీలో కూర్చుంటూ చిరునవ్వుతో అంది చంపా.

"ఎందుకట ?"

"ఎందుకేమిటి ... నీ తెలివి ! ఆయనకి అనుమానం రాదూ ?"

"ఎవడా ఆయనగారు ?"

"నాకు పుస్తె కట్టే మగాడు ... !"

"అనుమానం ఎందుకూ ? చిన్ననాటి స్నేహితులో మాటాడ్డం తప్పా ?"

"తప్పా ... ! తప్పున్నరా ! మీసాలూ, గడ్డాలూ వచ్చాక చిన్నతనం వెనక్కిపోతుంది... నువ్వు పరాయివాడివై పోతావు !"

"అయితే నీ కెప్పుడూ పెళ్ళి కాకుండు గాక ! కాఫీ తెప్పించనా ?"

"ఇవాళ నే తెప్పిస్తానప్పారావ్ ! నా కథకి ఫస్టు ప్రయిజొచ్చింది !" అంటూ ఉత్తరం అప్పారావు కిచ్చింది ... ఆనందం పెదవుల చిరునవ్వుమీద మెరవగా.

"కథా ? ప్రయిజా? నువ్వు కథలు కూడా

రాస్తావా ? ఈ పిచ్చి పట్టుకుంటే మరి వదల్తే !? ఆ సుబ్బారాయుడు లేడూ ... వాడే ... మనకన్న సీనియరు ! కవిత్వం పిచ్చి ... వేలెడంత వాడినించీ ప్రేమ కవిత్వం పద్యాలు రాసేసి నాకు చదివి వినిపించేవాడు ! ఏ మీద కూడా పద్యాలు రాసేడు తెల్సా ? నిన్ను ప్రేమించేట్ట ... ఇప్పుడు కాదు ... అప్పుడు ... ఇప్పుడు వాడేదో పల్లెటూర్లో సింగిల్ టీచరు ! పెళ్ళాం ... ఇద్దరు పిల్లలూ ... ఆ పిచ్చి మాత్రం నీకు పట్టనీకు !" ఏకబిగిని లెక్చరిచ్చేడు అప్పారావు, చంపా ఇచ్చిన ఉత్తరం చదివి ఆమెకిచ్చి.

చంపా ముఖం ముడుచుకోవడం గమనించి అప్పారావ్ నవ్వి ... "కోపమొచ్చిందా చంపాదేవిగారికి ? ఉత్తినే అన్నా సరదాకి ! నాకు చాలా సంతోషంగా ఉంది చంపా ! నా మీద కథ రాయి ఈసారి ! నీ తెలివి నాకు లేదు ... కలం పట్టుకుంటె అక్షరం ఊడి పడదు ... ఏం స్వీట్లు తినిపిస్తావ్ ?"

"నీ కేమిష్టమయితే అవి ... !" హేండ్ బ్యాగ్ తీసి ఐదురూపాయల కాగితం తీసింది ... ఆ నోటందుకొని "అరే గిరీ ఇలారా !" అంటూ కేకెయ్యగానే ఓ పదేళ్ల కుర్రాడొచ్చేడు ... నల్లటి పాత నిక్కరు... అనువచ్చుటి నూలు స్వెట్టరు ... చింపిరి జుత్తు ... "ఏం సార్!" అంటూ అణకువగా నిల్చున్నాడు ...

"ఈ డబ్బెట్టికెళ్ళి యిరవై రసగుల్లాలు, యిరవై గులాబ్ జాన్‌లు, ఇరవై

# స్పందన

మసాలా దోసెలు ... ఇరవై కప్పుల కాఫీ ... ఎంటనే ఒట్టుకురా ... ! మన గరేజ్‌లో అందరికీ పంచమను ... ! యిూడకి రెండు ప్లేట్లు పంపు ! మన చంపాదేవికి ప్రయిజు దొరికిందిరా ! అట్టా జూస్తావేం ... మిగిలిన్డబ్బు కాతాలో రాయమను అయ్యర్ని!" అంటూ హుకుమ్ జారీ చెయ్యడంతో గిరి పరుగుతీసేడు..."ఆళ్ళ సర్వర్ని పంపమను!" అరిచేడు అప్పారావ్ ! వర్క్‌షాప్‌లోని పని వారితో వారి యాసలో మాట్లాడతాడు ... చంపతో ఏ యాసాలేకుండా మాట్లాడతాడు ... కోపం వచ్చి తిట్టడం ప్రారంభిస్తే (చంపా లేనప్పుడు) ఆ ప్రవాహం ఆపడం ఎవరి తరమూ కాదు.

చంపా ఎంతో ఆనందించింది ... "నా ఫోటో పడుతుంది తెలుసా ?"

"అమ్మో ! అమ్మో ! ఆ ఫోటో చూసి ప్రేమించేసి ఏ అందగాడో రాడా ?"

"నువ్వు నా కిష్టంలేదు పొమ్మంటాను!"

"నిజంగా ?"

"నిజంగా !"

ఇలా కబుర్లయ్యేయి. ఒక గంట ఆలస్యంగా స్కూలుకి చేరుకునేసరికి స్కూలంతా ఈ వార్త వ్యాపించడం, మాష్టర్లంతా అభినందించడానికి ఎదురు చూడడం జరిగింది. మాష్టర్లందరికీ పార్టీకి మరో పది ఖర్చు. వారం దినాల కిందటే అందిన జీతంలోంచి తన స్వంత ఖర్చుకుంచుకున్న ఇరవైలోంచి ఈ ఖర్చు. పౌడర్ డబ్బా అయిపోయింది. జోళ్ళు ఒక జత కొనుక్కోవాలి. ఆ డబ్బు ఇలా ఖర్చయింది. ప్రయిజు డబ్బు ఎప్పుడు పంపుతాడో ?

ఈ ఆనందం పాల పొంగులా పొంగి రెండు రోజుల తరవాత దిగిపోయింది. నెల తరవాత వచ్చిన పత్రికలో తన బొమ్మ, తన పేరుతో కథ వచ్చాక ఆ ఆనందం మరో వారం దినాల వరకూ ఉండి చప్పబడిపోయింది. తన అచ్చయిన కథ ఒకటికి పదిసార్లు చదువుకుంది. తక్కిన టీచర్లు కథ చదివి బాగుందన్నారు. ఎవరూ అందులోకి లోతుగా వెళ్ళలేదు. అప్పారావుకి కథ అర్థం కాలేదు. ఫోటో బ్లాకు సరిగా రాలేదని ప్రెస్‌వాళ్ళని తిట్టేడు. నెల తరవాత కథ మూలని పడింది...మరో కథ రాసి పంపితే పదిరోజుల కల్లా అదే పత్రిక వారినించి తిరిగొచ్చింది ! మరి కథలు రాయాలనిపించలేదు చంపాకి. స్కూలుకి వెళ్ళి రావడం మామూలయిపోయింది ... నాన్నా, అమ్మా తన గురించి బెంగ పడడం మామూలయింది ... తను ... గురించీ ఆలోచించక పోవడమూ మామూలయింది.

ఇంతలో ఒకనాడు అప్పారావు తండ్రి పోయేడు. రాత్రి నిద్రలో చచ్చిపోయేడు. పొద్దున్నే అప్పారావొచ్చి నాన్నతో చెప్పగా, తనూ బయటకు వచ్చి సానుభూతి తెలిపింది. "పద అప్పారావ్ ! వేనొస్తాను!" అంటూ నాన్న తువ్వాలు భుజానవేసుకొని అప్పారావు కారులో ఎక్కేరు.

ఒకతరం వ్యక్తులు జీవయాత్ర చాలించి మరోలోకంలోకి పోతున్నారు! చంపాకి భయం వేసింది! నాన్న ఇంకెన్నాళ్ళు బతుకుతారు ? నాన్నపోతే తనకు దిక్కెవరు ? ఆమె కళ్లల్లో నీళ్ళు తిరిగేయి. కళ్లొత్తుకుంటూ లోనికి వెళ్ళింది. ఆ రోజు స్కూలుకి వెళ్ళాలనిపించలేదు.




## 32

కొన్ని కొన్ని నిజాలు ఎప్పటికీ, ఎల్లకీ నిజాలే అవి అలాతప్ప మరోలా జరగవని అందరికీ తెలుసు. నిప్పుని, రంజకానికంటిస్తే మంటలేస్తుంది. విత్తుని నాటి నీరుపోస్తే మొలకవేస్తుంది. ఇనుముని సూదంటురాయి ఆకర్షిస్తుంది — యవ్వనవంతులైన స్త్రీ పురుషులు ఒకరికి చేరువలో ఒకరుంటే ఆకర్షణ, ప్రేమ, వ్యామోహం, కామం ఈ







విజయ్‌స్ప్రే. మాంసకృత్తులు, విటమిన్లు మరియు ఖనిజ పదార్థాలతో సమ్మిళితమైన శిశు ఆహారం. తేలికగా జీర్ణంకాగలదు. సులభంగా నీటిలో కరుగగలదు. ఆరోగ్యసూత్రాలకు అనుగుణంగా తయారుచేయబడింది. విజయ్‌స్ప్రేను చాలా సులభంగా కలుపుకోవచ్చు. అంతర్జాతీయ ప్రమాణాలకు అనుగుణంగా తయారుచేయబడిన విజయ్‌స్ప్రే భారతదేశపు పసి పాపలకు చాలా అనువైన శిశు ఆహారం. విజయ్‌స్ప్రే తల్లి పాలవలె తియ్యగా ఉండేట్లు తయారు చేయబడింది.

అవును. మీ పాప ఆరోగ్యానికి డాక్టర్లు సిఫారసుచేసే శిశు ఆహారం... విజయ్‌స్ప్రే!

# విజయస్ప్రే

**కన్నతల్లి అనురాగానికి ప్రతిరూపం**

ఆంధ్రప్రదేశ్ పాడి పరిశ్రమాభివృద్ధి
కార్పొరేషన్ లిమిటెడ్ వారి
ఒక శ్రేష్ఠమైన ఉత్పన్నం
(ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ
యాజమాన్య సంస్థ)

అమ్మకందార్లు:
స్పెన్సర్ & కం. లిడ్.

FDS APDDC 3071A TEL

## స్పందన

నాలుగూ సమపాళ్ళలో కలసిన సూదంటు క్షేత్రం ఏర్పడుతుంది.

కాని నిజ జీవితంలో కూడా, మనసుకి అనిపిస్తున్నా "ఇలా జరుగుతుంది ... జరుగుతుంది" అని, ఆ అనిపించడాన్ని దైనందిక జీవితం అనే తెరవెనుక దాచేసి, "అలా జరగకూడదు ..జరగదేమో !" అన్న ఆశాభావంతో ఉంటాం

రామం, లిల్లీల విషయంలో కూడా కాశీపతి, అమ్మలూ ఇదే మానసిక దాగుడు మూతలు ఆడుకోవడంవల్ల, లిల్లీ అమెరికా వెళ్లిన రెండేళ్ళ తరవాత ఒకనాడు రామం నించి వచ్చిన ఉత్తరం చదివాక, వారికి ఆశ్చర్యం వెయ్యడమేకాక చిన్న షాక్ తగలడమే కాక, "అయ్యో ! ఇలా జరుగుతుందని తెలిసీ తెలిసీ కనుక్కోలేకపోయేమే ! ఇకనేందారి !" అనిపించింది

ఇదివరకు నెలకొక ఉత్తరమన్నా రాసే రామం ఏ మూడు నాలుగు నెలలకో మూడు నాలుగు పంక్తులు ఉత్తరం రాసినా వారు పట్టించుకోలేదు "ఏదో ! వాడి బతుకు వాడు బతుకుతున్నాడు ... అంతేచాలు !" అనుకునే స్థితికి వచ్చేరు– అప్పుడప్పుడు పాతికా, యాభై డాలర్లు పంపేవాడు. అవి చేసిన అప్పులు తీర్చడానికి సరిపోయేవి కాని ఈ ఉత్తరం ! ఏవేవో సంగతులు రాస్తూ ఆఖరికి ఏం రాసేడంటే...

"మీకు నామీద కోపం రాకూడదని ప్రార్థన, ఇన్నాళ్ళూ మీకు చెప్పని ఒక సంగతి చెప్తున్నందుకు—ఇపుడు మరి చెప్పక తప్పడం లేదు—నేను లిల్లీని ప్రేమించిన సంగతి మీకు సూచాయగా తెలిసినా, ఆమెను పెళ్ళి చేసుకొనే ప్రసక్తి మీ ముందు నేను తేకపోవడం వల్ల ఆ సంగతి ఎపుడూ బహిరంగంగా మన మధ్యని ఘర్షణకి కారణం కాలేదు. కాని కులమత భేదాలు, వర్ణభేదాలూ, డబ్బు ఉండడం మానసం, కట్నం, కానుకలు ... ఇవేవీ నా దృష్టిలో ఎప్పుడూ, నా కిష్టమయిన జీవిత భాగస్వామిని చేపట్టడంలో అడ్డుపెట్టుకోకూడదన్న నిశ్చయం నా కెప్పుడూ ఉండేది. లిల్లీని తప్ప మరో అమ్మాయిని నేను ఏనాడూ పెళ్ళి చేసుకొనే ప్రశ్నే లేకపోవడం వల్ల, ఆ పని పూర్తి చేసుకొనే నేను అమెరికాకి వచ్చేనని

ధర్మపథం

## మహాత్ముల మహిమ

— బులుసు వేంకటరమణయ్య

ఎంత మంచిమాట చెప్పినా దానిని వినేవారు అరుదు. "ఒకరికి చెప్తారేకాని, తాము మాత్రం తప్పుదారిలోనే నడుస్తా"రని వెంటనే విమర్శ వస్తుంది. ఉత్తమ గుణాలను ఆచరణలో పెడుతూ ఉన్నవారే హితబోధ చేస్తున్నట్లు తమకు బాగా తెలిసినా — ఆ హితవాక్యాలు వినేవారు ఎక్కువమంది ఉండరు. అందువల్ల హితోపదేశం చేసేవారు జనసామాన్యాన్ని ఆకర్షించే శక్తులు కలిగి ఉండాలి. అట్టి శక్తులు మహాత్ములకే ఉంటాయి. వారి అద్భుత శక్తులను చూచిన ప్రజలకు వారిపై గొప్ప భక్తి కలుగుతుంది. ఆ భక్తి కుదరడంవల్ల ఆ మహనీయుల ఉపదేశం విని, ఆ విధంగా నడుచుకోవాలనే సంకల్పం కలుగుతుంది. మహామహులు తమ అద్భుత శక్తులవల్ల జనసామాన్యాన్ని ఆకర్షిస్తూ ఉంటారు. ఆ శక్తులవల్ల వారు అత్యాశ్చర్యకరంగా వస్తువులను సృష్టించి ప్రదర్శిస్తూ ఉంటారు. తమ శక్తులను వారు జనులను ఆకర్షించి ప్రబోధం చెయ్యడానికి మాత్రం ఉపయోగిస్తారు.

ఒకప్పుడు ఒకవ్యక్తి విశాఖపట్నంలోని వరల్డ్ టీచర్ ట్రస్టు అధినేతలు మాష్టరు గారితో మాట్లాడుతున్నప్పుడు యీ విషయాన్ని ప్రస్తావిస్తూ "మహాత్ములు, బాబాలు, మాతృశ్రీలు తమ మహిమలను చూపి, ప్రజలను ఆకర్షించడంకంటె, ఆ మహిమల వల్ల ధనధాన్యాదులను సృష్టిచేసి, దారిద్ర్యంతో బాధపడుతున్న ప్రజలను బాధల నుండి విముక్తి చేయవచ్చునుగదా! ఎందుకలా చెయ్యరు?" అని ప్రశ్నించాడు.

అప్పుడు మాష్టరుగారు చెప్పిన సమాధానం యిది — ఈ దారిద్ర్యం మనం సృజించుకొన్నదేకాని వాస్తవికమైనది కాదు. నేను ప్రపంచమంతా తిరిగివస్తూ ఉంటాను. అన్నిదేశాల సంగతీ నాకు తెలుసు. మన దేశంలో ఉన్న సహజసంపద మరేదేశంలోనూ లేదు. ఖనిజ సంపద, జనసంపద, అటవీసంపద, వస్తుసంపద అన్నీ ఉన్నాయి. కాని మనవారు సోమరితనంవల్ల వాటిని ఉపయోగించుకోక వస్తువులకే కాకుండా, ఆహారపదార్థాలకు కూడా అమెరికా మొదలైన దేశాల దిగుమతులకు నోరు తెరచుకొని చూస్తూ కూర్చుంటారు. మహనీయులు వాటినికూడా సృజించి ప్రజాసామాన్యానికి పంచిపెడితే వారి సోమరితనం ఇంకా పెరిగి పూర్తిగా నిష్ప్రయోజకులయిపోతారు. సహజసంపద పూర్తిగా నిరుపయోగమయిపోతుంది. మహాత్ములు వాటిని సృష్టిస్తే ప్రజలకు అపకారం చేసినవారే అవుతారు. ఉపకారకులు కాజాలరు. అందువల్లనే వారు తమకు శక్తి వున్నా ధనధాన్యాదులను సృజించడంలేదు.

మాష్టరుగారి సమాధానం ఎంతో యుక్తియుక్తంగా ఉన్నది. మనవారు సర్వప్రజాహితాన్నికోరి, సోమరితనాన్ని పూర్తిగా విసర్జించి, చురుకుగా కార్యనిర్వహణానికి పూనుకోవాలి. అప్పుడు దారిద్ర్యం తనంతటతానే నశించిపోయి, దేశం అభివృద్ధిపథంలో నడుస్తుంది.

---

ఇప్పుడు నీకు రాస్తున్నందుకు నన్ను క్షమించాలి! లిల్లీ నా భార్య! మీ ఇంటి కోడలు! రెండురోజుల క్రితం లిల్లీ మగ శిశువును ప్రసవించింది! తల్లీ పిల్లా క్షేమంగా ఉన్నారు! ..." అంటూ ఇంకా ఎన్నో సంగతులు రాసేడు. లిల్లీ అమెరికా పౌరురాలు కాబట్టి, ఆమెను పెళ్ళాడ్డం వల్ల తనూ అమెరికా పౌరుడే అయ్యేడు. అక్కడ లిల్లీ, తనూ అక్కడి పౌరసత్వం కోసం మరోసారి స్నేహితులముందుదండలు మార్చుకున్నసంగతి రాయలేదు ... కాని తను ఇండియా రాబోటం లేదనీ, అమెరికాలోనే ఉండిపోతాడనీ రాసేడు. తనూ, లిల్లీ తీయించుకున్న రంగు ఫిల్ము ఫోటోలు పంపుతూ, వంద డాలర్లకి చెక్కు కూడా పంపేడు.

ఈ ఉత్తరంలోని వార్త ఆ చిన్నఇంట్లో పెద్ద అణు బాంబునే పేల్చింది. మగశిశువు కలిగినప్పటినించీ ఎన్నో ఆశలు పెట్టుకుంటారు తల్లిదండ్రులు. వాడు పెరిగి పెద్దవాడౌతూ, పెద్ద చదువులు చదువుతూ తమ మనసుకు ఆనందం కలిగిస్తాడని, తరవాత పెద్ద ఉద్యోగం చేస్తూ, తమకు నచ్చిన పిల్లనే చేపట్టి, తమ చెప్పినట్టు వింటూ సంసారయాత్ర సాగిస్తాడనీ కలలు కంటారు. అటువంటి కలలు కన్న కాశీపతి, అమ్మలూ ఈ వార్తతో అతఃపాతాళానికి అణిగిపోయినట్టు అయిపోయేరు. ఒక్కసారిగా తొంభయి ఏళ్ళ వృద్ధాప్యం తమని ఆవహించినట్టనిపించి, కృంగిపోయి, నోట మాట రాకుండా ఉండిపోయేరు.

అమ్మ. ఒక్క పెట్టున ఏడవడం చూసి, చంపా ఓదార్చింది — "ఏడ్చి లాభం ఏముందమ్మా? ఇలా జరుగుతుందని మనం అనుకుంటూనే ఉన్నాంకదమ్మా? కాలం మారిపోయిందే ...!" అంది తల్లి కళ్ళు ఒత్తుతూ.

"ఆ శాంతమ్మ ఇదంతా చేసింది! నా కొడుకుని మాయలు పన్ని దాని కూతుర్ని కట్టపెట్టింది! లేకపోతే దీని కూతుర్ని ఎవరు చేసుకుందురు? ఇప్పుడు నలుగురిలోనూ ఎలా తల ఎత్తుక తిరగను! మన వంశం పరువు ప్రతిష్ఠలూ మంట కలిసిపోయేయే! ఇప్పుడా శాంతమ్మ తనకి మనవడు పుట్టినట్టు గొప్పగా ఊరంతా చెప్పక తిరుగుతుందే! ఈ ముసలికాలంలో లేమికి సాయం ఈ అప్రతిష్ట కూడానా తల్లీ! ఈ ప్రాణం ఈ క్షణంపోతేబాగుణ్ను!" అంటూ ఆగకుండా అరగంట సేపు తన మనసులోని సంక్షోభాన్ని మాటల రూపాన వెళ్ళగక్కింది.

నాన్న బాగానే తట్టుకోడం గమనించి చంపా కుదుటపడింది. "సరేలే! ఇప్పుడెవర్నేమని ఏం లాభం! మనం ఒప్పుకున్న సంబంధం చేసుకొని మాత్రం రెండో కొడుకు మనల్ని ఉద్ధరించేడో చెప్పు? ఇప్పటికి ఎర్రని ఏగానీ మనకి పంపలేదుకదా? అప్పుచేసి ఇల్లుకొన్నాడు. అప్పుచేసి హాస్పిటల్ పరికరాలు కొన్నాడు వచ్చిన డబ్బేదో అప్పు తీర్చడానికీ, పనివాళ్ళ జీతాలకి సరిపోతోందంటాడు! పోనీ మనల్ని వచ్చి తనతో ఉండమనన్నా రాయడు! పెద్దవాడే నయం! తనకున్న దాంట్లోంచి మిగిల్చి పదీ పరకా పంపుతున్నాడు! మనల్నందర్నీ అమెరికా తీసుకుపోతానంటున్నాడు.. మన కులం, మన మతం కాకపోతేనేం, లిల్లీ మన మీద చూపే ఆపేక్ష మన రెండో కోడళ్ళు ఏనాడూ చూప

# స్పందన

లేదని నా అభిప్రాయం.'' కాశీపతి పరిస్థితులు అవగాహన చేసుకొని, అనర్హ పరిస్థితులని కూడా అర్థవంతంగా మలుచుకోడానికి ఒక గంట కాలం సరిపోయింది.

శ్రీను ఇంత భార్యా దాసుడౌతాడని కాశీపతి ఊహించలేకపోయేడు. వారిద్దరూ ఈ ఊరు ఎప్పుడన్నా వస్తే ప్రకాశరావింట సామాను పడేసేక శ్రీను ఇక్కడికి చుట్టపు చూపుగా వస్తాడు. అత్తగారూ, మామగారూ ఏమనుకుంటారోనని ఇక్కడ భోజనమన్నా చెయ్యడు. తనకున్న అప్పుల గురించీ, కొనవలసిన పరికరాల గురించీ, ఇంకా కొనలేకపోతున్న మోటారు కారు గురించీ వాపోతాడు! మీనాక్షి కూడా వస్తుంది. ఉన్నంతసేపూ తన కసలు ఉన్న చీరలు చాలవనీ, ఫలానా నెక్లేసు చేయించుకుందికి సొమ్ము లేకపోతోందనీ, తక్కిన డాక్టర్ల పెళ్ళాల ముందు తనకి తలవంపులయిపోతున్నదనీ, అమెరికా వెళ్ళలేపోతేమానె, ఎండకాలంలో కాశ్మీరో, సిమ్లానో ఓ సారి తీసుక వెళ్ళండీ అని శత పోరినా వీలుకాలేకపోతోందనీ, తన కలలు ఎలా ఫలించడం లేదో అమ్మ ముందు ఏకరువు పెడుతుంది. అమ్మకీ, నాన్నకి బట్టలు జతన్నాతేవడం అంటూ లేకపోగా, మీనాక్షి ఎప్పుడు వచ్చినా ఆమెకి చీరా, రవికలగుడ్డా మేలురకంవి కొని పెట్టడానికి వందకి పైగా తమకి ఖర్చు! చీరలూ నగలూ సరిపోయినన్ని కొనుక్కుందుకి డబ్బులేని తమని చూసి సానుభూతి చూపమని మీనాక్షీ, తనకి కావల్సిన అధునాతన పరికరాలూ, ఒక పది మంచాలు పట్టే నర్సింగ్ హోమ్‌లా తన హాస్పిటల్‌ని చేసుకోగలిగేందుకు కావల్సిన లక్షరూపాయల మదుపూలేవని శ్రీను పడే వేదనా పట్ల తాము ఏ విధంగా సానుభూతి చూపగలమో చంపాకి అర్థం కాదు! తమ ఇల్లు పెంకులు మార్చిడిలేక, దర్జు పాతదయి పైకప్పు కూలిపోయే పరిస్థితి ఏర్పడింది. రెండు పూటలా పప్పు, కూరా, అన్నం తినడం తను తెచ్చిన మూడు వందలూ, అప్పుడప్పుడు రామం పంపే డబ్బుతోనూ సాధ్యం కాక పోగా ఇంటి మీద అప్పు తేవడం జరిగింది, పాత అప్పు రామం పంపే డబ్బులోంచి తీర్చగా, ఈ ఇల్లు బాగు చేయించకుండా అమ్మకానికి పెడితే ఆరువేలు కూడా రావు. బాగు చెయించడానికి ఐదువేలు కావాలి! తనకి ఉన్నవి ఆరు చీరలు—అందులో స్కూలుకి కట్టుక వెళగలిగేవి కేవలం నాలుగు! అప్పుడప్పుడూ ఏవన్నా ఫంక్షన్లయితే అమ్మకుండే పట్టుచీరలు కట్టుక వెళ్ళడం పరిపాటయింది. పెళ్ళి కావల్సిన ఈ చెల్లెలికి ఈ అన్నలు చేసిన నిర్వాకం ఏమిటి? ఎవరన్నా తన పెళ్ళి గురించి ఆలోచించేరా? నాన్న ఎప్పుడన్నా శ్రీనుతో ఆ సంగతికదుపుతే, ''డాక్టర్లు ... ఇంజనీర్లు ... వేపు మనం కన్నెత్తి చూడలేం నాన్నా! ఇరవైవేలూ, పాతికవేలూ తెమ్మంటారు! చూస్తూ చూస్తూ వంద తెచ్చుకొనే గుమాస్తాకిచ్చి పెళ్ళి చెయ్యలేమూ!'' అంటూ నీళ్ళు కారుస్తాడు. గుమాస్తాకి నాడు నాలుగు వందలు వస్తున్నా, వంద తెచ్చుకున్నట్టే లెక్క కడతాడు! పదివేలకి తను మామగారికి ఇల్లరికపుటల్లుడుగా అమ్ముడు పోవడం, ఏ కట్నం లేకుండా లిల్లీ రామంని చేపట్టడం ఇవి ఎక్కడో తప్ప జరగని సంగతులీవాడు. మీనాక్షికి చవగ్గా, లిల్లీకి ఏమీ ఖర్చు లేకుండానూ డాక్టరూ, ఇంజనీరు దొరకడం సంగతేమిటని అమ్మ ఆడగలేదు ... అడిగి లాభం ఏమిటి?

ఆనాడు రామం అలా రాసేక గడచిపోయిన ఏడాది కాలంలోనూ ఇల్లు మరింత కూలిపోసాగింది ... అమ్మ బెంగతో మంచం ఎక్కింది ... గుండెపోటు...కాళ్ళూ చేతులూ వాపులు ... శ్రీను వచ్చి చూసి, ఏవో మాత్రలు ఇచ్చి వెళ్ళేడు. అమ్మ వాటిని పెరట్లో విసిరేసింది! ''వీడిని కని విద్యాబుద్ధులు చెప్పించినందుకు ఈనాటికి వీడు వేలు ఆర్జిస్తున్నా, నాకు దొరికేవి నాలుగు మందు మాత్రలు! ఈ మాత్రలు మింగితే చావు దగ్గర పడుతుంది తప్ప ఆలస్యం కాదు!'' అంటూ గొణిగింది.

నాన్న జాత్తంతా పండిపోయింది. చంపాని చూడడానికి అతడికేదో బెదురు. కొడుకుల కంతా పెట్టి, కూతురు కేమీ లేకుండా చేసి జీవిత రంగంలోంచి తప్పుకుంటున్నామే అన్న దోష భావం! తనకు తెలిసిన పరిచయస్థులతో ఎందరితోనో చెప్పేరు, ''ఏదన్నా ఓ సంబంధం చూడండి మా పిల్లకి! నా ప్రాణంపోయేలోగా దానినో అయ్య చేతిలో పెట్టేస్తే నా ఆత్మకి శాంతి దొరుకుతుంది!'' ''తప్పకుండా కాశీ! తప్పకుండా!'' అని వాళ్ళు అనడమే తప్ప, ఆ సంబంధమే దొరుకుతే

## స్పందన

తన ఎదిగిన అమ్మాయిలకి చేసేయడానికి నాన్న వెయ్యి కళ్ళు పెట్టుక వెతుకుతున్నారు ! ఆఖరికి భార్యపోయిన రెండో పెళ్ళివాడయినా సరే అన్న ధోరణిలో ఉన్నారు ఆడపిల్లల తండ్రులు ... !

ఒకనాడు సాయంత్రం, అమ్మతో నాన్న చంపా గురించి తన అశక్తత గురించి వాపోతూ ఉండగా, చంపా విని ముందుకొచ్చి అంది ... "నాన్నా! నువ్వూ అమ్మా ఆరోగ్యంగా ఉండడమే నాక్కావాలి! నా పెళ్ళి గురించి చింత పడకండి! ఉద్యోగం ఉంది! నా కాళ్ళమీద నేను నిలబడ్డాను! పెళ్ళి జరక్కపోయినంత మాత్రాన నష్టం నాకేమీ కనిపించటేదు. భారతదేశం తన సంతానాన్ని మొయ్యలేకపోతోంది ... తిండి పెట్టలేక ఏడుస్తోంది...మరింత సంతానాన్ని కని ఆమె ఏడుపుని ఎక్కువ చెయ్యడమెందుకు ?"

నాన్న చంపాకేసి విచారంగా చూసేరు ... చంపా ఈ మాటలు మనస్ఫూర్తిగా అనీ వచ్చు! కాని తన మనసులోని వేదన ఎలా పోతుంది ? ఒక కన్యని తన సంసారపు చెర లోంచి తప్పించవలసిన బాధ్యతా, బరువు తన భుజాలమీంచి ఎలా పోతుంది ?

ఈ సంగతలా ఉండగా మీనాక్షి పుట్టింటికి వచ్చింది ... గాజులు పెట్టించడం, ఆ వేడుకలూ వైభవోపేతంగా జరిగేయి ... కోడలికి పట్టుచీర ... కొన్ని వేడుకలు కిందా మరో నాలుగు వందలు ఖర్చయింది. రామం ఆ నెల పంపిన డబ్బు దీనికింద సరిపోయింది. తొమ్మిది నెలలూ నిండి కొడుకు పుట్టేనప్పుడు శ్రీను ఇక్కడే ఉండి అన్ని ఏర్పాట్లూ చూసుకున్నాడు. శాంతమ్మ పురిటికి సాయపడింది. భార్యకి సిసేరియన్ చెయ్యవల్సి వస్తుందో ఏమో, ఎంత బాధపడిపోతుందో అని ఎంతో ఆవేదన పడుతూ తన బెంగని నాన్నా అమ్మలకి శ్రీను వెలిబుచ్చినప్పుడు, నాన్న సానుభూతి చూపి, "ఫరవాలేదురా! ఏం ఫరవాలేదు!" అంటూ జాతకం తిరగేసి చెప్పవల్సి వచ్చినపుడు చంపా నాన్నమీద జాలి పడింది. నాన్నా అమ్మల దారిద్ర్యం గురించీ, వారి ఆరోగ్యం గురించీ, చెల్లెలి భావి గురించీ లేని బెంగ శ్రీనుకి పాపం! భార్య సుఖంగా ప్రసవించగలదో లేదో అని పట్టుకోడం ఎంత హాస్యాస్పదమో, చంపకి అనిపించినా ఏం చెయ్యగలదు ?

కొడుకు పుట్టగానే ఆనందంగా పరుగున వచ్చి నాన్నతో చెప్పి, సమయం నిముషాలతో కూడా చెప్పి, జాతక చక్రం వెయ్యమని శ్రీను అడిగినప్పుడు, ఈ ఎం. డీ పాసయిన డాక్టరేనా జాతకాల పిచ్చిలో ఉన్నది అని చంపా విస్తుపోయింది. ఏదో నక్షత్రం ... ఏదో పాదంట ... ఏదో దోషంట ... తల్లి గండమట ... శాంతి చెయ్యాలట ... !

అమ్మ రిక్షాలో అతి కష్టంమ్మీద వెళ్ళి మనవడ్ని చూసి వచ్చింది. బాలసారెకి వాళ్ళు భోజనానికి పిలిచారు ... కాని వెళ్ళడం పడలేదు. ఎంతో సంబరపడిన అమ్మ అకస్మాత్తుగా గుండెనొప్పితో లేవలేకపోయింది. పీటలమీద కూర్చున్న కొడుకుని పిలవలేక మరో డాక్టర్ని తీసుక వచ్చి చూపేరు. ఆయన ఒక ఇంజక్షన్ ఇచ్చి, నిద్రకి మాత్రలిచ్చి, ఆమె మంచంమీంచి లేవడానికి వీల్లేదన్నాడు. అమ్మ పరిస్థితి గమనించిన చంపా తల్లిపక్కనే ఉండిపోయింది. నాన్న వెళ్ళి అక్కడ ఒక అరగంట కూర్చొని వచ్చేసేరు. అమ్మ ఆరోగ్యం బాగోలేదని చెప్పగా, అది మామూలు సంగతే అన్నట్టు వాళ్ళు ప్రవర్తించేరు—వారి వేడుకల్లో వారున్నారు.

బాలసారె తరవాత శ్రీను ఒకసారి వచ్చి అమ్మని చూసి, విశ్రాంతి అవసరమని చెప్పి, ఏవో మందులు తెచ్చి ఇచ్చి, విశాఖపట్నం వెళ్ళిపోయేడు. శ్రీను వెళ్ళిన మర్నాడు రాత్రి నిద్రమాత్రల ప్రభావంతో నిద్రపోతున్న అమ్మ, మరి మర్నాడు ఆ నిద్రలోంచి మేలుకోలేదు— నిద్రపోతోందే అనుకున్నారు ... ఆ నిద్ర శాశ్వతమని తెలిసే సరికి, చంపా తల్లి మంచంమ్మీద ఏడుస్తూ, కూలిపోయి తెలివి పోగొట్టుకుంది.

(ఇంకా ఉంది)

## కోరిక

కొండలు, కోనలూ
చెట్లు, చేమలూ
నదులు, నదాలూ
అన్నీ చూస్తుంటే
తొందరగా చచ్చిపోయి
వాటిలో కల్సిపోవాలని వుంది !

ఎస్. మునిసుందరం

# దిట్టమైన జత
# అన్ని కాలాలకు పాదరక్ష



# TROT®
## ట్రాటక్-ప్లాట్‌ఫామ్

| | | | | |
|---|---|---|---|---|
| మగవారివి | 7 – 10 | రూ. | 16.50 |
| ఆడవారివి | 2 – 6 | రూ. | 15.25 |
| పిల్లలవి | 9 – 1 | రూ | 10.75 |

స్థానిక పన్నులు అదనము



# TROT®
## ట్రాటక్-కుషన్

| | | | |
|---|---|---|---|
| జయింట్స్ | 11 & 12 | రూ. | 14.50 |
| మగవారివి | 7 – 10 | రూ. | 12.99 |
| ఆడవారివి | 2 – 6 | రూ. | 11.99 |
| పిల్లలవి | 9 – 1 | రూ. | 9.95 |
| శిశువులవి | 6 – 8 | రూ. | 8.30 |

స్థానిక పన్నులు అదనము

Grant. DRP. 10Tel

**అదనపు మెత్తదనము మరియు సౌకర్యము**

గతిశీలులైన "డైనమిక్" వారివద్ద ఎన్నెన్నో క్రొత్త క్రొత్తవి ఉన్నాయి మీకు

ట్రాట్ ట్రేడ్‌మార్క్ స్వంతదారు:
ట్రాట్ షూ కంపెనీ ప్రైవేట్ లిమిటెడ్
19/4ఎ, మున్షీగంజ్ రోడ్, కిద్దర్‌పూర్, కలకత్తా-700 023

తయారీ లైసెన్స్ పొందినవారు:
DRP
డైనమిక్ రబ్బర్ అండ్ ప్లాస్టిక్ ప్రైవేట్ లిమిటెడ్
వైట్‌ఫీల్డ్ రోడ్, మహాదేవపుర పోస్ట్, బెంగళూరు-560 048

# నీతినేత







అంగర వెంకట సత్యనారాయణ రావు

మేడమెట్ల కింద గుమ్మానికి బిగించి వున్న స్విచ్ నొక్కేసరికి పైన బజర్ మ్రోగింది. తలుపు తెరచుకుంది. పనిమనిషిలా వుంది –

'ఒవురు కావాలి బాబూ ?' అంది.

'మాష్టారున్నారా ?' నా ప్రశ్న.

'పెదబాబుగోరా ?' ఎదురు ప్రశ్న.

అవునన్నట్టుగా తలూపేను. లోపలికొచ్చి కూర్చోమంది. మెట్లెక్కి ముందు హాల్లోవున్న సోఫాలో కూర్చున్నాను. రెండు నిమిషాలు గడిచేయి. తెర తొలగించుకుంటూ మాష్టారొస్తున్నారు. అంత వృద్ధాప్యంలో కూడా ఎంతో ఆరోగ్యంగా వున్న మాష్టారు నన్ను చూసి –

'నువ్వటోయ్ ! విరించి అంటే ఎవరు చెప్మా అనుకున్నాను. జ్ఞాపకం రానేలేదు. ఎన్నో సంవత్సరాలైందేమో నిన్ను చూసి, ఎక్కడా మనస్సుకి తట్టనేలేదు. మరోలా అనుకోకుమీ ! నీ ఐడెంటిటీ చెప్పగానే మా వాడు అదిరిపోయేడుట. నువ్వో పేషెంటువేమో అనుకున్నాట్ట మొదట మా వాడు. నువ్వు మధ్యాహ్నం వస్తావనీ, తప్పకుండా ఇంట్లో వుండమనీ చెప్పేడు.'

అభిమానంతో ఆయన చెయ్యి నా శిరస్సుమీద వెయ్యగానే ఆయన కళ్లు చెమర్చేయి. నా కళ్లూ చెమర్చేయి.

''ఏమిటి కథా ? ఎక్కడున్నావూ ? ఏం చేస్తున్నావూ ? పేర్లు జ్ఞాపకం రావడంలేదు గాని – జడ వేసుకొని వొచ్చేవాడో పంగనామాల ఆచారి – మరో లుంగీ అయ్యరు – మీ ముందున కూడదుగాని నాలాంటి లెక్చెరర్లు గర్వించదగ్గవాళ్లు మీరంతా.''

ఆయన పుత్ర వాత్సల్యంతో నా వీపుమీద రాస్తూ చెప్పకుపోతున్నారు.

నేను చేతిలోని హేండ్ బ్యాగ్‌లోంచి ఒక కాగితం తీసి ఆయన కందించాను. అది సుమారుగా శిథిలం అయిపోయి, కేవలం మాసికలమీద నిల్చివుంది. ఆయన దానిని జాగ్రత్తగా అందుకొని చూసేరు. ఎన్నో సంవత్సరాల క్రితం ఆయన నా కిచ్చిన టెస్టిమోనియల్ అది.

ఆయన ముఖంలో ఆనందం, అభిమానం, వాత్సల్యం ఏవేవో, ఎన్నెన్నో అనుభూతులు రెప రెప మారిపోతున్నాయి. నా దగ్గిరగా జరిగి నన్ను కావిలించుకున్నారు.

'ఎంత భద్రంగా దాచిపెట్టేవు !' ఆయన గొంతు గద్గదికం అయింది.

'నేను స్టేట్‌బ్యాంక్ ఉద్యోగానికి వెళ్లేటప్పుడు మీరిచ్చేరు మాష్టారూ !'

'అయితే స్టేట్‌బ్యాంక్‌లో వున్నావన్నమాట.'

'లేదు మాష్టారూ ! ఆ వుద్యోగం రాలేదు. పరీక్ష బాగానే రాసేను. కాని తీగల బేరంలో ఆగలేక పోయాను.'

ఆయన నవ్వేరు.

'అయితే మీ ఆశీర్వచనంవల్ల అంతకంటె మంచి వుద్యోగంలోనే చేరేను.'

వివరాలన్నీ చెప్పేను. ఆయన ఎంతో సంతోషించేరు.

'నీకు జ్ఞాపకం వుందోయ్ ? ఎం. ఏ. అనే ఒకతనుండేవాడు. నీకు కొంచెం సీనియర్ అనుకుంటా ?'

'నాకు తెలియకపోవడం ఏమిటి మాష్టారూ ఎం. ఏ. చిన్నప్పటి నుంచీ స్నేహితులం. సెకెండ్ ఫారం చదువుతూండగా స్కూళ్ల ఇనస్పెక్టరు అతని అసాధారణమైన తెలివితేటలకి ఆశ్చర్యపోయి 'నీ పేరేమిటి బాబూ' అన్నాట్ట. ఎం. ఏ. మూర్తి అంటే మారుతి ఆనందమూర్తి అని జవాబిచ్చేట్ట. అంతే – 'ఎం. ఏ. !' చాలా బాగుంది నీ పేరు అని ఆయన రెండుసార్లు అన్నాట్ట. ఎం. ఏ. అతని సార్థక నామం అయిపోయింది.'

మాష్టారు సులోచనాలు సవరించుకొని తిరిగి అన్నారు.

'అలాంటి గొప్ప స్టూడెంటుని నా సర్వీసులో అప్పటివరకూ చూడలేదు. ఎంత గ్రస్పింగ్‌శక్తి ! ఎంత ధారణ ! అతని తెలివితేటలు నిజంగా

మిగిలిన తెల్లదనాలని మైమరపించే స్వచ్ఛమయిన తెల్లదనం యిచ్చే స్కోర్—నీలం డిటర్జెంట్ బిళ్ల. ప్రకాశవంతమయిన తెలుపు. తెల్లని తెలుపు. సాటిలేని తెలుపు! స్కోర్ నీలం డిటర్జెంట్ బిళ్ల మీ దుస్తుల మురికిని పోగొట్టి వాటికి పరిశుభ్రమయిన తెలుపుని యిస్తుంది. స్కోర్ నీలం డిటర్జెంట్ బిళ్లతో ఎన్నో బట్టలు వుతకవచ్చు. ఎంతో తెల్లగా, రంగు దుస్తులకి కూడా మెరుపుతనం తెస్తుంది.

# విజయ సాధనలో తళ తళ మెరిసే తెలుపు!

# స్కోర్

## నీలం డిటర్జెంట్ బిళ్ల

కేరళ స్టేట్ డిటర్జెంట్స్ & కెమికల్స్ లిడ్.
(ఒక ప్రభుత్వ సంస్థ)




విజయ సాధనలో తళ తళ మెరిసే తెలుపు!

FDS KSDC 3022A TEL



## సబీనా! సబీనా!

న్యూఢిల్లీలో జరుగుతున్న 8వ అంతర్జాతీయ చలన చిత్ర ప్రదర్శనల్లో నాలుగవ రోజున ప్రదర్శింపబడిన 'సబీనా' అనే పోటీ చిత్రం కొంత గందరగోళాన్ని సృష్టించింది. ముందుగా అందజేయబడిన సంక్షిప్త కథాసారం ప్రకారం స్పెయిన్‌లో వున్న ఒక గుహలో 'సబీనా' అనే పేరు గల ఓ డ్రాగన్ పురుషుల నాకర్షించి — వారితో కామవాంఛ తీరిన వెంటనే వారిని చంపేస్తూ వుంటుందన్న ఒక్కటే పురాణం వుంది. ఐతే ఆ డ్రాగన్‌చేత ఓ వంద సంవత్సరాల క్రితం చంపబడ్డ ఓ బ్రిటిష్ రచయిత మరణానికి సంబంధించిన వివరాలు సేకరించడానికి ఆ గుహ ప్రాంతంలో వున్న చిన్న గ్రామానికి ఇద్దరు బ్రిటిష్ కవులు వస్తారు. చిన్నతనంలో మంచి మిత్రులుగా వుండే వీళ్లిద్దరూ మనస్పర్థలు పెంచుకోడం జరుగుతుంది. ఆ గ్రామంలో విభిన్న మనస్తత్వం గల ముగ్గురు అందమైన యువతులతో వీరికి పరిచయం జరగడం, ఇద్దరూ ఒకరిమీద ఒకరు ఈర్ష్య, ద్వేషాలు పెంచుకోడం — చిట్టచివరికి ఆ గుహలోనే ఆశ్చర్యకరంగా మరణించడం ఈ కథలోని సారాంశం.

చిత్రీకరణలో ఎక్కడా అసభ్య శృంగారంగానీ, నగ్న దృశ్యాలుగానీ, క్రూర సన్నివేశాలుగానీ లేవు. ఐతే ఎవరూ వూహించనంత ఆకర్షణ పెరగడంతో టిక్కెట్లు విపరీతమైన ధరల్లో బ్లాక్‌లో అమ్ముడుపోయాయి. ఈ చిత్రాన్ని విజ్ఞాన్ భవన్‌లో 6వ తేదీ సాయంత్రం చూపించినపుడు విపరీతమయిన జనం రావడంవలన, ప్రత్యేక ప్రతినిధులు, ప్రత్యేక ఆహ్వానితులు అధిక సంఖ్యలో రావడంవలన ప్రెస్ డెలిగేట్స్‌కి, హాల్లోకి ప్రవేశం లభించలేదు. పోలీసులు లాఠీలతో జనాన్ని [ప్రెస్ డెలిగేట్లను] వెనక్కి తరిమేశారు. షాన్ చిత్రంలో నటించిన కులభూషణ్ ఖర్బందాను ఓ పోలీసు ఒక్క వూపుతో వెనక్కి తోయడంతో అతను మెట్లమీంచి పడిపోవల్సి వచ్చింది. రీడర్స్ డైజెస్ట్ ఎడిటర్, హిందూస్థాన్ టైమ్స్ కరెస్పాండెంట్ మొదలయినవారుకూడా పోలీసు లాఠీల రుచి చూడక తప్పలేదు.

[ సత్యప్రభ ]

## పీలి పీడ

అసాధారణం. పైగా ఎంత నమ్రత! ఎంత సత్ప్రవర్తన! అతనెక్కడున్నాడూ? ఏం చేస్తున్నాడూ ?'

మాష్టారు ఆత్రుతగా ప్రశ్నించేరు. నా గుండె క్రుంగిపోయింది. ఏం జవాబు చెప్పను ? చెప్పేను చివరకి —

'లేడు మాష్టారూ అతను !' నిట్టూర్పుతూ జవాబిచ్చేను.

'అంటే ! ఏమైంది అతనికి ?'

'అంతే మాష్టారూ !' తల దించుకున్నాను.

వరి పిడుగులాంటి నా సమాధానానికి ఆయన హృదయం అతలాకుతలం అయింది. వడగాడ్పు వంటి ఒక నిట్టూర్పు విడిచేరాయన. ఒక్క నిమిషం మౌనం వహించి ఆయన తిరిగి అన్నారు —

'ఎం. ఏ. యూనివర్సిటీకి ఫస్టొచ్చేడు బి. యస్‌సి. లో. కారణం నాకు తెలియదుగాని సుమారు ఒక నెలవరకూ అతను తన పై చదువు గురించి ఆలోచించలేదు. ఒకనాడు హడావిడిగా నా దగ్గరకొచ్చేడు —

'మాష్టారూ! ఎం. యస్‌సి. చదవాలని వుంది. కాని ఇప్పటికే చాలా కాలాతీతం అయిపోయింది. సీటు బహుశా ఎక్కడా దొరకదు. ఏం చెయ్యాలో తోచక మీ దగ్గిరకొచ్చేను.'

'నీకు సీటు దొరక్కపోవడం ఏమిటి చెప్పూ! అలహాబాదులో నా ఫ్రెండు ప్రొఫెసర్ చూడాముణి వున్నాడు. అతనికో లెటరు ఇస్తాను. తీసికెళ్ళు' అన్నాను సిఫార్సు రాస్తూ. ఎం. ఏ. కాశీ విశ్వవిద్యాలయంలో ఎం. యస్‌సి. చదివేడు. విశ్వవిద్యాలయానికే ప్రథముడుగా పాసయేడు. అంతేకాదు — అదివరకటి రికార్డు లన్నింటినీ మించిపోయేడు. ఇంతలో మరో ఎస్సైన్‌మెంటుమీద నేనా కాలేజీ విడిచి వెళ్లిపోయాను.'

తరువాతి కథ ఏమిటన్నట్టు ఆయన ప్రశ్నార్థకంగా ముఖం పెట్టేరు. నేను చెప్పనారంభించేను—

ఎం. ఏ. నాకంటె రెండు క్లాసులు ముందు. కాలేజీ పుస్తకాలెప్పుడు చదివేవాడో తెలిసేదేకాదు. అతనికి నాటకాలన్నా, నవలలన్నా చాలా ఇష్టం. కన్యాశుల్కం గుక్కతిప్పకుండా విరగబడి నవ్వుతూ చదివేవాడు.

ప్రతిరోజూ తెల్లారగట్ల నాలుగింటికే యిద్దరం బయల్దేరి సుమారు మూడు మైళ్ళ దూరాన వున్న కంటోన్మెంటు వరకూ ఇటించి పరిగెట్టుకుంటూ పోయి, తిరిగి నడిచివొచ్చేవాళ్లం. అతనిది మంచి ఆరోగ్యం. తెల్లగా, బొద్దుగా వుండేవాడు. కమ్మెమ్ముల తీసిన కండలప్రభ, అఖండమైన తెలివితేటలు, మంచి స్నేహబుద్ధి అతనిది.

ఉదయాన్నే స్నానం చేసి చల్ది అన్నం, తెలక పిండి వడియాలు నంచుకొని తినేవాడు. కాఫీలాంటి అలవాట్లు లేనేలేవు. అతని విద్యార్థి జీవితం అలా గడిచింది. అన్నట్టు అతనికి బాల్ బ్యాట్‌మింటన్ ఎంతో యిష్టం. రెండు చేతుల్తోనూ ఆడేవాడు. సవ్యసాచి అనేవాళ్లం చప్పట్లు కొట్టి నవ్వుతూ. అతనూ నవ్వేవాడు. యింకా హుషారుగా ఆడేవాడు.

కాశీ నించి రాగానే అతనికి ఉద్యోగం అయింది. ఏ కాలేజీలో తను చదువుకున్నాడో, ఆ కాలేజీలోనే, ఆ క్లాసులకే పాఠాలు చెప్పనారంభించేడు. మొదటి రోజున అతను క్లాసుకు రాగనే బోర్డుమీద పెద్ద అక్షరాలతో 'ఎం. ఏ. గారికి సుస్వాగతం' అని రాసి వుంది. ఆయన ఒక్కసారి బోర్డువైపు, విద్యార్థుల వైపు చిరుమందహాసంతో చూసేరు.

'ఎవరా ఘనుడు ?' అతని ప్రశ్న.

సమాధానం లేదు. పిన్ను నేలజారితే వినిపించేటంత నిశ్శబ్దం ఆవరించింది.

'పరవాలేదు చెప్పండి' తిరిగి ప్రశ్నిస్తూ బెంచీల దగ్గిరంగా నడుచుకుంటూ వెళ్లేడు. ఒకరి ముఖాలొకరు చూసుకున్నారు బిక్కు బిక్కు మంటూ.

చివరి బెంచీలోంచి ఒక వైట్ ప్యాంటు లేచి నించున్నాను. ఏదో సందేహం — ఏదో భయం. మాట రాలేదు.

'చెప్పూ !'

'ఇది మా అందరి అభిమతం మాష్టారూ ! నేను చొరవ తీసుకున్నాను. మిమ్మల్ని అలా పిలవడమే మేం మిమ్మల్ని గౌరవించడం. ఏ సంక్షిప్త నామంతో మీరు ఈ కాలేజీకి, కాశీ విశ్వవిద్యాలయానికీ ఘనత సంపాదించి పెట్టేరో, ఆ పేరే మా అందరికీ యిష్టం' అన్నాడు.

'మీ అభిప్రాయం మంచిది కావొచ్చు. కాని ఎప్పుడూ ఇటువంటి పని చెయ్యకండి' నవ్వుతూ మందలించేడు.

మట్టి బొమ్మల్లాంటి విద్యార్థుల్ని తీర్చిదిద్ది, మాణిక్యాలుగా రాణింపజేసేవాడు. అలా గడిచింది కొంతకాలం.

'మందార !' నిజంగా చక్కదనాల చుక్క. ఎం. ఏ.కి వేలువిడిచిన మేనమామ కూతురు. ఈడూ జోడైన ఈ జంట నిజంగా జంట అయేరు.

నేను తరచుగా ఉదయంవేళ వాళ్ళింటికెళ్లేవాడిని. తలుపు తట్టి ఎం. ఏ. అని పిలిచేవాణ్ణి. గబగబ వొచ్చి తలుపు తీసేది మందార.

(33వ పేజీ చూడండి)

## 1980లో

125 తమిళం, 89 మలయాళం, 54 కన్నడం, 2 కొంకిణి, 1 బడుగు భాషా చిత్రం, 137 తెలుగు చిత్రాలు (వీటిలో డబ్బింగ్ 24) విడుదలయ్యాయి. (1979లో తెలుగులో 121 చిత్రాలు విడుదలయ్యాయి). చిత్ర నిర్మాణంలో మాత్రం తెలుగు సినిమారంగం భారత దేశంలో అగ్రస్థానం పొందింది. ద్విపాత్రాభినయ చిత్రాలు షుమారు 17 విడుదలయ్యాయి. వైవిధ్యం లేని చిత్రాలకు ప్రజలు విసుగు చెందారు. దాదాపు 10 చిత్రాలు మధ్యాహ్నం ఆటలుగా ప్రదర్శింపబడ్డాయి. సగటున మూడు రోజులకొక చిత్రం విడుదలైంది. శతదినోత్సవాలు జరుపుకున్న చిత్రాలలో నిర్మాతలకు లాభం తెచ్చిపెట్టిన చిత్రాలను వేళ్ళమీద లెక్కపెట్టవచ్చు.

అత్యధిక చిత్రాలలో పాల్గొన్నవారు : కృష్ణ 17, జయప్రద 15, డైరెక్టర్ దాసరి నారాయణరావు 8, సంగీత దర్శకుడు చక్రవర్తి 35, రచయిత జంధ్యాల 25, ఛాయాగ్రాహకుడు పుష్పాల గోపీకృష్ణ 7.

## 1981 స్వర్ణోత్సవ సంవత్సరం !

1981 భారత చలన చిత్ర పరిశ్రమకు స్వర్ణోత్సవ సంవత్సరం.

15 ఏళ్ళ క్రితం వెయ్యి అడుగుల బ్లాక్ అండ్ వైట్ ఫిలిమ్‌కు రూ. 135 కాగా ఇప్పుడు రెండువేల రూపాయలవుతోంది. రెండేళ్ళలో ప్రాసెసింగ్ రేట్లు రెట్టింపయ్యాయి.

చిత్ర నిర్మాణంలో ఓ వేగం 1980 ఆరంభంలోనే బాగా ద్యోతకమవుతూ వచ్చింది. పోస్టులో పంపాల్సిన వర్తమానాన్ని టెలిగ్రామ్ మూలంగా, టెలిగ్రామ్‌లో పంపవలసిన వార్తను ట్రంక్ కాల్ ద్వారా, ట్రంక్ కాల్ మూలంగా చెప్పవలసిన విషయాన్ని స్వయంగా ప్లేన్‌లో వెళ్ళి చెప్పడం జరుగుతూండేది. ఇందువల్ల అదనపు వ్యయం కూడా. 1981 ఆరంభంలో ఆ వేగం అంతగా కనిపించడం లేదు. ఇప్పుడు నిర్మాణంలో ఉన్న చిత్రాలు హడావిడిగా విడుదలయ్యాక జూన్ – జూలై మాసాల నుంచి విడుదలయ్యే చిత్రాల ఉధృతం తగ్గవచ్చుని పరిశ్రమలోని అనుభవజ్ఞుల అభిప్రాయం.

1980లో కొన్ని చిత్రాల గురించి వివరాలు పత్రికలకు పంపడంతోనే పురిట్లోనే సంధికొట్టాయి. మరికొన్ని చిత్రాలు ఒకటి రెండు పాటల రికార్డింగ్స్‌తో, కొన్ని రెండు మూడురోజుల షూటింగ్స్‌తో ఆగిపోయాయి. ఆరంభదశలోనే ఆగిపోయిన చిత్రాల నిర్మాతలు కొందరు కొన్ని బండి ముందుకు కదలడం కోసం హుటాహుటిగా వి హోటళ్ళలోనో ప్రెస్‌మీట్ అంటూ సమావేశపరచి పాత్రికేయులకు రికార్డు చేసిన పాటలు వినిపిస్తూ వచ్చారు. వాటివల్ల ప్రయోజనం లేదని చివరికి కొందరు గుర్తించారు.

చిత్రాల నిర్మాణ విషయంలోనే 1980లో చిత్ర పరిశ్రమ ముందంజ వేసింది. ఆర్థిక బలం, అంగబలం, దక్షత, లక్ష్యం లేకుండా ఎన్నో సంస్థలు పుట్టుకురావడంతో లోగడ విజయవంతమైన చిత్రాలు నిర్మించిన ప్రముఖ సంస్థలు కూడా పరోక్షంగా దెబ్బతిన్నాయి. ఫలితంగా ఎన్నో ఆటంకాలు వివిధ రీతుల్లో ఎదుర్కొంటున్నాయి. దీనివల్ల పరిశ్రమలో విపరీతమైన ఆర్థిక సంక్షోభం ఏర్పడింది. 1981 మరింత గడ్డు సంవత్సరం కాగల ప్రమాదం ఉందేమోనని పరిశ్రమలోని పలువురు ప్రముఖులు అభిప్రాయ పడుతున్నారు.

**జి. వి. జి.**

### మరో కురుక్షేత్రం

దాసరి నారాయణరావు కథ, స్క్రీన్‌ప్లే, పర్యవేక్షణలో, ఆయన శిష్యుడు రేలంగి నరసింహారావు దర్శకత్వం నెరపే శ్రీ చరిత చిత్రవారి "మరో కురుక్షేత్రం" చిత్రంలో మోహన్‌బాబు హీరో. "హైదరాబాద్‌లో ఫిబ్రవరి నుంచి షూటింగ్ ఉంటుంది," అన్నారు నిర్మాత తమ్మారెడ్డి వి. కె. నేటి రాజకీయ పరిస్థితులు–విద్యార్థుల స్థితి గతుల మధ్య ఘర్షణను కొత్త కోణంలో చర్చించే కథాంశం గల చిత్రమని నిర్వహణ బాధ్యతలు చూసే తమ్మారెడ్డి భరద్వాజ తెలియజేశారు.



'గజదొంగ'లో ఎన్. టి. ఆర్., జయమాలిని



'బంగారు కానుక'లో ఒక దృశ్యం

## సినిమా

### సంసారం — సంతానంలో సంభాషణలు రాయని శాస్త్రియ!

అవుట్‌డోర్ షూటింగ్‌కు దాదాపు అన్ని సన్నాహాలూ పూర్తి చేసుకున్న ప్రొడ్యూసర్—కమ్—డైరెక్టర్ సన్యాసిరావు (స్వర్గీయ కె. వి. చలం) తన దర్శకత్వ వాకవన్యానికి నాందిగా "స్టార్ట్!" అన్నాడు. ఇంతలో అసిస్టెంట్ డైరెక్టర్ (పిట్టబాబు) పరుగున వచ్చి, "ఏమి స్టార్టు, సార్, ఇంకా డైలాగులు రాలేదు," అంటూ ఏడ్పుముఖం పెట్టాడు.

"ఆఁ! డైలాగులు రాలేదా? అందుకుదాఁ — వద్దురా, ఆత్రేయుదాఁ రాయడు. మనల్ని నేల నేసి రాస్తాడు, వద్దురా — అని మొత్తుకొంటేని — వింటేవా?" డైరెక్టర్ నెత్తి బాదుకున్నాడు.

"సార్! మన పిక్చర్‌కి డైలాగులు ఆత్రేయ కాదు; శాస్త్రియ," అంటూ సవరించాడు అసిస్టెంట్.

"ఏ త్రేయ అయితే యేం? రాయలేదు - అందుకని వాడు ఆత్రేయే! సినిమాకు టైటిల్ని పెట్టడం, డైలాగులు రాయడం, రాసింది చెప్పడం— అంతా పాతకాలంరా. నేను దాఁ చెప్తాను. రాసుకో!" అని డైరెక్టర్ హుకుం జారీ చేసేసరికి అసిస్టెంటు మళ్ళీ ఏడ్పుముఖం పెట్టాడు.

మూనిమోలాలో పై సీన్ చూస్తున్నప్పుడు "తమాషా ఏమిటంటే, మా చిత్రానికి సంభాషణల కర్త ఆత్రేయగారే," అన్నారు నీలిమా ప్రొడక్షన్స్ "సంసారం — సంతానం" చిత్ర నిర్మాతల్లో ఒకరైన కొల్లి ఆంజనేయులు. "అల్లూరి సీతారామరాజు, శివరంజని — చిత్రాల తర్వాత తెలుగు తమిళవాడుగా అదే ఒరవ తో సరికొత్త తరహా పాత్రలో మళ్ళా జీవించారు కె. వి. చలం," అన్నారు మరో నిర్మాత కొత్తపల్లి రమేష్‌బాబు. వి. మధుసూదనరావు దర్శకత్వంలో పి.బి.జి. లాక్ సమర్పించే ఈ చిత్రంలో శోభన్‌బాబు, జయసుధ, సీమ, ప్రభాకరరెడ్డి, రమాప్రభ, గిరిజ, అన్నపూర్ణ నటించారు. ఆత్రేయ, వేటూరి, వెంకట్, కుదరవల్లి నాగేశ్వరరావు, దోనవల్లి కోటేశ్వరరావు, ఆర్. శ్రీనివాసరావు, సదాశివరావు తెరవెనుక కృషి చేశారు.

### సీతాలు

"రాజశ్రీ రాసిన రెండు జంట పాటలను మురళీమోహన్, జయసుధల మీద చిత్రీకరించాం," అన్నారు దుర్గా నాగేశ్వరరావు. ఈయన దర్శకత్వంలో త్వరితగతిన తయారవుతూన్న మణియన్ ఫిలిమ్స్ "సీతాలు" చిత్రానికి దాసరి నారాయణరావు కథ, స్క్రీన్‌ప్లే ఒక ఎస్సెట్ అని తెలియజేశారు నిర్మాతలు మణియన్, విద్వాన్ లక్ష్మణన్. సత్యనారాయణ, మోహన్‌బాబు, గిరిబాబు, నిర్మల ఇతర ముఖ్యభూమికలు నిర్వహిస్తున్నారు. రాజశ్రీ సంభాషణలు, ఎం. ఎస్. విశ్వనాథం సంగీతం, హరి ఛాయ, భాస్కరరాజు శిల్పం, బాలు కూర్పు తెర వెనుక హంగులు. ఫిబ్రవరి 10 నుంచి 25, మార్చి 10 నుంచి 20 వరకు జరిగే షెడ్యూల్స్‌తో షూటింగ్ ముగుస్తుంది. దుర్గా నాగేశ్వరరావు దర్శకత్వంలో మణియన్, విద్వాన్ లక్ష్మణన్ నిర్మించిన ఉదయం ప్రొడక్షన్స్ "స్వర్గం" ఫిబ్రవరి మొదటి వారంలో విడుదలవుతుంది.



ఫిల్మోత్సవ్ చిత్రం షోగున్స్‌నింజా(జపాన్)లో ఒక దృశ్యం.



'ఎర్రమల్లెలు'లో ఒక దృశ్యం

## సినిమా

### రహస్య గూఢచారి

### రహస్యంగా ప్రవేశించిన భర్త !

అన్నపూర్ణ (జానకి) తలుపు తీసింది. ఎదురుగా మారువేషంలో ఉన్న భర్తను చూసి నివ్వెరపోయింది. "ఎవరు మీరు ?" అంది.

"నా పేరు ధర్మరాజ్," అన్నాడా వ్యక్తి (సత్యనారాయణ).

"బ్రతుకుతోపాటు పేరు కూడా మారిందన్న మాట ? ఇల్లు – ఇల్లాలు ఇప్పటికి గుర్తొచ్చారా?"

"నేను వచ్చింది నువ్వు గుర్తొచ్చావని కాదు. నీ పిల్లల మూర్ఖత్వంతో నా దోవకు అడ్డొస్తున్నారని హెచ్చరించడానికి. ఇంకోసారి నీ కూతురు నా విషయంలో జోక్యం కలిగించుకుంటే, నీ కొడుక్కి పట్టిన గతే దానికీ పడుతుంది."

"అంటే ... అంటే ... రమేష్‌ని — ?"

"నా దోవకి అడ్డొస్తున్న ఆ కలుపుమొక్కను నేనే లాగి అవతలపడేశాను."

"నూరు గొడ్లను తిన్న రాబందు ఏదో ఒక రోజున గాలివానకు బలి కావల్సిందే. మీరు దేశానికి ద్రోహం చేస్తున్న క్షణాన నా భర్త చనిపోయాడని గుండె రాయి చేసుకున్నాను. మీరు మరో దోవ చూసుకున్న క్షణాన నా కాళ్ళమీద నేను నిలబడగల నన్న ధైర్యంతో ఇప్పటివరకూ బ్రతికి ఉన్నాను. ఇప్పుడు కన్నకొడుకుని బలి తీసుకొని ఆకలి తీర్చుకున్న రాక్షసుణ్ని మాత్రం క్షమించను. కొడుకును చంపిన కసాయి తండ్రిని కూతురిచేత చంపిస్తాను."

"నోర్మూయ్ ! నీ కూతుర్నే కాదు; నిన్నూ బతకనివ్వను," అంటూ ధర్మరాజ్, అన్నపూర్ణ గొంతు పిసికాడు. ఆమె గుడ్లు తేలవేసింది. మరో క్షణంలో కుప్పలా పడిపోయింది. ధర్మరాజ్ ఆవేశంతో బయలుదేరాడు.



'రహస్య గూఢచారి'లో జయమాలిని

కె. ఎస్. ఆర్. దాస్ దర్శకత్వంలో సుందర్‌లాల్ నహతా సమర్పించే శ్రీకాంత్ పిక్చర్స్ "రహస్య గూఢచారి" స్కోప్ కలర్ చిత్రానికి శ్రీకాంత్ నహతా నిర్మాత.

### విశ్వరూపం

ఎన్. టి. ఆర్., దాసరి సమ్మేళనంలో తయారయ్యే మరొక విశిష్టమైన సంగీతభరిత వినోదాత్మక చిత్రానికి "విశ్వరూపం" అనే పేరును స్థిరపరచినట్లు కవిరత్న మూవీస్ తొలి చిత్రాన్ని సమర్పించే కొసరాజు తెలియజేశారు. జయసుధ, మరో నాయికగా అంబిక అనే కొత్త యువతి నటిస్తారు. సత్యనారాయణ, రావు గోపాలరావు, అల్లు రామలింగయ్య ఇతర ముఖ్య పాత్రధారులు. చక్రవర్తి, కె. ఎస్. మణి, భాస్కరరాజు, కోటగిరి గోపాలరావు, సలీమ్, నందం హరిశ్చంద్రరావు, డి. కోటేశ్వరరావు, కె. కోటేశ్వరరావు తెరవెనుక కృషి చేస్తారు. "ఫిబ్రవరి 21 నుంచి 28, మార్చి 20 నుంచి 31, ఏప్రిల్ 20 నుంచి 30 వరకు జరిగే మూడు షెడ్యూల్స్‌తో చిత్ర నిర్మాణం ముగుస్తుంది," అన్నారు నిర్మాత కె. భానుప్రసాద్.

### కె. రాఘవేంద్రరావు దర్శకత్వంలో అన్నపూర్ణ స్టూడియోస్ 4వ చిత్రం

శ్రీమతి అక్కినేని అన్నపూర్ణ సమర్పించే చిత్రంలో ఎ.ఎన్.ఆర్., శ్రీదేవి, రావు గోపాలరావు, మోహన్‌బాబు, అల్లురామలింగయ్య, ప్రభాకరరెడ్డి, మధుమాలిని, పుష్పలత, తెరముందు—సత్యానంద్, చక్రవర్తి, ఆత్రేయ, కె. ఎస్. ప్రకాష్, జి. వి. సుబ్బారావు, సలీమ్, అంజనేయచౌదరి తెరవెనుక కృషి చేస్తున్నారు. జనవరి 14న ప్రారంభమైన తొలి షెడ్యూల్ 27వ తేదీకల్లా పూర్తవుతుందని నిర్మాతలు వెంకట్, నాగార్జున తెలియజేశారు.

# గోళ్ళు సరిగ్గా లేవా?



అవి మెత్తగా/చెక్కేసినట్లు/
పగిలి/పెచ్చువూడి/
గిడసబారాయా?

ఇప్పుడు
అద్వితీయమైన
ప్యాక్‌లో అదనపు
ధర పెట్టకుండానే.

మీకు కావాలి

# కాల్షియం-శాండోజ్®

బిళ్ళలు

## వాడి చూడండి, మీకే కనిపిస్తుంది ఆ తేడా.

మీరు చేయవలసిందల్లా వెనిల్లా వాసనగల, రుచియైన 4 కాల్సియం శాండోజ్ బిళ్ళల్ని ప్రతిరోజూ పదిహేను రోజులపాటు తీసుకోవడమే. మీ గోళ్ళిక దృఢంగా, అందంగా తయారౌతాయి. శాస్త్రీయ అధ్యయనం వలన యీ విషయం ఋజువైంది. తీసుకోండి— కాల్షియం శాండోజ్—స్విట్జర్‌లాండ్‌లో శాండోజ్ వారిచే రూపొందించబడిన, ప్రపంచంలోకల్లా ఉత్తమమైన కాల్షియం. కాల్షియం—శాండోజ్ కావాలని పేరుపెట్టి అడిగి తీసుకోండి, అంతేగాని దానికి బదులు మరి దేనినీ తీసుకు సరిపెట్టుకోకండి.

ఈ సమస్య మళ్ళా తలెత్తుతే,
ఆ మోతాదును మళ్ళా
తీసుకోండి.




daCunha-S-22 Revi TL



## పులిబిడ్డలో చంటిబాబు

అన్నపూర్ణ (జానకి) హాల్లో కూర్చొని ఏదో పత్రిక తిరగేస్తోంది. పోస్ట్‌మన్ ఒక రిజిస్టర్డ్ పార్శిల్ తీసుకొచ్చాడు. "ఒరే, చంటీ! నీకేదో పార్శిల్ వచ్చింది," అని అన్నపూర్ణ కేకెట్టగానే కుమార్ (కృష్ణంరాజు) వచ్చి సంతకం పెట్టి, పార్శిల్ తీసుకున్నాడు. "ఎక్కడ్నించబ్బా! ఆ — అమ్మా, మా ఫ్రెండ్ ఒకడు సింగపూర్ వెళ్తుంటే, మా అమ్మకు మంచి చీరలు పంపమన్నాను. వాడు పంపించి ఉంటాడు," అంటూ పార్శిల్ విప్పడం మొదలెట్టాడు. ఒక పెట్టె ... అందులో ఇంకో పెట్టె ... దానిలో మరో చిన్నపెట్టె — చివరి పెట్టెలో ఒక పాలబుడ్డీ కనిపించేసరికి కుమార్ తుళ్ళిపడ్డాడు. దాని ట్యాగ్‌మీద 'చంటికి ప్రేమతో' అని రాసి ఉండడం చదివాడు అన్నపూర్ణమ్మ కూడా ఆశ్చర్యపడ్డా — వెంటనే నవ్వేసింది.

కుమార్ చిన్నబుచ్చుకుని, "ఏవిటమ్మా నవ్వుతావు? అసలు దీనికంతకూ నువ్వే కారణం. ఎంతమందిలోబడితే అంతమందిలో 'చంటీ!' అని పిలుస్తావు. ఎవరో నన్ను ఏడిపించడానికి ఈ పని చేసి ఉంటారు," అంటూ ఏడ్పుముఖం పెట్టాడు.

"పోనీలే, బాబూ! నిన్ను ఆ పేరుతో పిలిస్తేనే నాకు తృప్తిగా ఉంటుంది. ఇంతకీ, ఈ పని చేసింది ఎవరై ఉంటారు?" అంది అన్నపూర్ణ.

"తెల్సుకుంటాను ఎవరు చేశారో. వదులుతానా?" అంటూ కుమార్ ఏకాయెకీన బయలుదేరాడు. అన్నపూర్ణమ్మకు మళ్ళీ నవ్వు ఆగింది కాదు.

వి. మధుసూదనరావు దర్శకత్వంలో నాము శేషగిరిరావు నిర్మించిన హేరంబ చిత్రమందిర్ వారి "పులిబిడ్డ" చిత్రం త్వరలో విడుదలవుతుంది.

## అత్తగారి పెత్తనం

"ఫిబ్రవరిలో పాటలు రికార్డ్ చేసి, మార్చిలో షూటింగ్ మొదలెడుతున్నాం," అన్నారు దగ్గుపాటి భాస్కరరావు. ఈయన అనంతలక్ష్మి క్రియేషన్స్ పతాకంలో తలపెట్టిన చిత్రానికి పై పేరు పెట్టారు. నటవర్గంలో మురళీమోహన్, సరిత, జానకి; సాంకేతికవర్గంలో సత్యానంద్, సత్యం, వెంకట్ ఇంతవరకు నిర్ణయింపబడినట్లు చెప్పారు డైరెక్టర్ రాజాచంద్ర. ★

## కల్యాణయోగం

విద్యాసాగర్ ఇంటర్నేషనల్‌వారి పై తొలి చిత్రం షూటింగ్ కొత్త సంవత్సరం రెండవ రోజున ప్రారంభమైంది. రాజా శ్రీధర్, సుభాషిణి, కాంతారావు, శుభ, కాశీరాం, నాగేంద్ర, మాధవీలత, లలిత, ఆనందమోహన్, అర్జా జనార్ధనరావు ప్రభృతి నటవర్గం; సత్యం, సుఖదేవ్, వెంకటరత్నం, ఆర్. మహదేవన్, మోహన్, తార, షాయర్, ఎ. సుధాకర్, ఆర్. సుధాకరరెడ్డి వగైరా సాంకేతిక వర్గం. కథ, స్క్రీన్‌ప్లే, మాటలను కూడా డైరెక్టర్ రాజా శ్రీధర్ సమకూర్చారు.







# లాన్సర్

## స్టెయిన్‌లెస్ బ్లేడు




## ప్రతి క్షౌరములో మృదుత్వాన్ని సుఖాన్ని చేకూర్చటానికి

లాన్సర్ బ్లేడు యొక్క ప్రత్యేకముగా తయారు చేయబడిన పదునైన అంచులు ప్రతి క్షౌరాన్ని మృదువుగాను సుఖంగాను చేయడమేకాక ఎంతో తృప్తినిస్తుంది.

ఈ ఉదయమే లాన్సర్‌కు మారండి.







ఒక బ్లేడు ధర
25 పైసలు
స్థానిక పన్నులు
అదనము

## లాన్సర్ - మృదువుగా క్షౌరము చేయు బ్లేడు

మార్కెట్ చేయువారు : టి.టి. కృష్ణమాచారి అండ్ కో. మద్రాసు, బొంబాయి, కలకత్తా, ఢిల్లీ

Imageads-TTK-1274 Tel

తాజా వార్తలకు, వ్యాఖ్యలకు, కొంగ్రొత్త ప్రత్యేక శీర్షికలకు ఆంధ్రపత్రిక దిన పత్రిక పెట్టింది పేరు...మీరు మీ కాపీ మీఊరి ఏజెంటుద్వారాగాని లేదా మానేజరు, గాంధీనగరం, విజయవాడ-3 లేదా మానేజరు, బషీర్‌బాగ్, హైద్రాబాద్-29 కి గాని వ్రాసి పోస్టులో తెప్పించుకొనండి.




MCA PDC/62/Tel

# దేశాల మధ్య నూనె గొట్టాలు

**సో**వియట్ యూనియన్‌లో గత పదిహేను సంవత్సరాలలో సహజ వాయువు ఉత్పత్తి నాలుగురెట్లు, నూనె ఉత్పత్తి మూడురెట్లు పెరిగింది. ఈ నూనె, సహజవాయువు ఉత్పత్తి దేశ అవసరాలకు తోడ్పడమే గాక, ఇందులో గణనీయమయిన భాగం విదేశాలకు సరఫరా అవుతూ వుంది.

నూనె, సహజవాయువుల గొట్టపు మార్గాల విస్తృత వ్యవస్థను సోవియట్ నిర్మించింది. వీనిలో అత్యంత ముఖ్యమయినది ట్రాన్స్ — యూరోపియన్ గ్యాస్ మార్గం. ఈ మార్గం ద్వారా సోవియట్ సహజవాయువు తూర్పు యూరప్‌లోని అనేక దేశాలకు, ఆస్ట్రియా, ఇటలీ, పశ్చిమ జర్మనీ, ఫ్రాన్సు దేశాలకు సరఫరా అవుతూ వుంది.

చాలా పెద్ద నూనె రవాణా గొట్టపు మార్గాలలో 6,000 కిలోమీటర్ల పొడవుగల 'ద్రూజ్బా' గొట్టపు మార్గం ఒకటి. దీని ద్వారా ఓల్గా ప్రాంతం నూనె హంగరీ, జర్మన్ ప్రజాతంత్ర రిపబ్లిక్, పోలెండ్, జెకోస్లోవాకియాలలోని నూనెశుద్ధి కర్మాగారాలకు, బాల్టిక్, నల్ల సముద్రాలలోని రేవులకూ ప్రవహిస్తుంది.

మూడు సంవత్సరాల క్రితం నిర్మితమయిన "సొయూజ్" గొట్టపు మార్గం ద్వారా సాలీనా 28,000 మిలియన్‌ల ఘనపు మీటర్ల సహజ వాయువు సరఫరా అవుతుంది. ఈ గొట్టపు మార్గం ప్రపంచం మొత్తంలోనే అతి పెద్దది. దక్షిణ ఉరాల్స్ నుండి పశ్చిమ సరిహద్దువరకూ, సోవియట్ యూనియన్ దాటే యీ బ్రహ్మాండమయిన గొట్టపు మార్గనిర్మాణంలో బల్గేరియా, హంగరీ, జర్మన్ ప్రజాతంత్ర రిపబ్లిక్, పోలెండ్, జెకోస్లోవాకియాలు పాల్గొన్నాయి.

"సియా నివెసరేరా", "బ్రాత్స్ త్వో" గొట్టపు మార్గాల ద్వారా కూడా సోవియట్ సహజ వాయువు యూరప్ దేశాలకు సరఫరా అవుతూ వుంది. ★

# నీలి నీడ

[22 వ పేజీ తరువాయి]

ముత్యాల కోవలాంటి పలువరుస సుందర ముఖార విందానికి మెరుగులు దిద్దుతూంటే, సింగారాలొలికి పోయేలా నవ్వుతూ 'రండి, రండి, కూర్చోండి. మీ ఫ్రెండు చద్దిఅన్నం సేవిస్తున్నారు' అనేది అమాయకంగా.

'ఇంకానా ?' నా ప్రశ్న.

'హయ్యో ! మీరుట్టి అమాయకులు. అడగండి వారినే. అడిగి దాని రుచి తెలుసుకోండి. అన్నట్టు మీరూ మీ ఫ్రెండులాగే కాఫీ తాగరేమో. ఉండండి ఒక్కక్షణం' అంటూ ఆవిడ లోపలికి పరిగెత్తింది.

కొంపతీసి తరవాణీ తేదుగదా అనుకున్నాను. రెండు నిమిషాల్లో ఒక గ్లాసుతో వేడి వేడి పాలు తెచ్చింది.

'చంపేశారు ! కాఫీ తెస్తారేమో అని ఆశ పడ్డాను.'

ఆవిడ బిక్కమొహం పెట్టి చేయి వెనక్కి తీసుకోబోయింది.

'ఫరవాలేదు లెండి' అంటూ గ్లాసు అందుకున్నాను.

అతని అలవాట్లు చిన్నప్పటి నుంచీ నాకు తెలుసు. చిన్నప్పుడు అతనికేదో పెద్ద జబ్బు చేసిందిట. వాళ్ళతండ్రి అబ్బులు ఆయుర్వేద వైద్యం చేయించేడుట. నలభై లంఖణాల తరవాత, ముప్పై కఠిన పత్యాల తరవాత ఎం. ఏ. బ్రతికి బైటపడ్డాడు. కాని మామూలు బలం చాలారోజుల వరకూ రాలేదు. వైద్యుడు సూచించగా ప్రారంభించేడు చద్దిఅన్నం, పుల్లిపాయ వగైరా. అంతే — నెల్లాళ్ళకల్లా ఉక్కు గుండులా తయారయేడు. చిన్నప్పటి ఆ కథే కంటిన్యూ అవుతూంది.

అబ్బులు నిజంగా పాతకాలపు నాడు. అతను ఆరోగ్య శాఖలో పనిచేసి రిటైరయ్యాడు. రిటైరవడానికి ఒకటి రెండు సంవత్సరాలకు పూర్వం అతనికి బ్రహ్మచెముడు పట్టుకుంది. ఒక రబ్బరుగొట్టానికి ఒకవైపు కిరసనాయిలు గర్లాలాంటిది బిగించి, రెండోవైపు చెవిలో పెట్టుకొనేవాడు. ఎవరొచ్చినా గర్లాలో మాట్లాడమనేవాడు. ఆయన ఎంతో మంచివాడు. మర్యాదస్తుడూను. చాలా చాదస్తుడు. ప్రవహించే జలం, గోక్షీరం నిత్యం సేవిస్తే పక్షవాతం మొదలైన పెద్ద జబ్బులు దగ్గిరకి చేరలేవని ఆయన నమ్మకం. భార్య మహాలక్ష్మి ఆయన్నే అనుసరించేది. మందార అత్తగారి అడుగుజాడల్లో నడిచేది. ఎం. ఏ. తరవాణీ బాపతు కనా. ఇంట్లో అంతా టీ టోట్లర్సే అన్నమాట.

మాష్టారూ ! మీకు తెలుసునో తెలీదో ఎం. ఏ. సైన్సు పత్రికలకి వ్యాసాలు రాస్తూండేవాడు.

నాకు తెలియకపోవడమేం. ఒకసారి నాకో రీ ప్రింటు పంపించి అభిప్రాయం రాయమన్నాడు ప్రత్యేక ప్రాభవం గల అతని రచన నాకెంతో ఆశ్చర్యాన్ని, ఆనందాన్ని కలిగించిందనిన్నీ, అతనికి ఖండాంతర ఖ్యాతి రావాలనీ ఆశీర్వదిస్తూ రాసేన.

ఆ మాటలంటూంటే మాష్టారి హృదయం పొంగి ప్రవహించింది.

విద్యార్థుల ప్రోద్బలంమీద అతను అప్పుడప్పుడు గొప్ప గొప్ప వ్యాసాలు రాసి పత్రికలకి పంపేవాడు. కాని పరమ బద్ధకిష్టు. అనుకున్నట్టుగానే అతని వ్యాసం ఒకటి ఫ్రెంచి సైన్సు అకాడమీ దృష్టిలో పడింది. పరిశోధన నిమిత్తం ఫ్రాన్సు రమ్మనమని వాళ్ళు ఎం. ఏ.ని ఆహ్వానించేరు. విద్యార్థులు, మిత్రులూ ఎంత ప్రోద్బలం చేసినాససేమిరా అతను వెళ్ళలేదు.

మందార అతని కెదురుగా నించొని సిగ్గుతో అంది — 'కొత్త కాపురం అని సందేహిస్తున్నారేమో ! మరేం పరవాలేదు. ఒక్క సంవత్సరంకదా. వెళ్ళిరండి. అభ్యంతరం లేకపోతే నేనూ వొస్తా.'

'ఆ వాతావరణం, ఆ అలవాట్లూ మనకి సరిపడవు.' టకా టకీమని జవాబు చెప్పేడు.

మందార నవ్వి వూరుకుంది.

మరి కొన్నాళ్ళకి ఆ సంస్థ కోరికపైనే ఒక గొప్ప పరిశోధనా వ్యాసం రాసి పంపేడు. దానికి ప్రతిఫలంగా డాక్టరేట్, వేలమీద బహుమతి లభించేయి ఎం. ఏ కి.

మరికొన్నాళ్ళకే ఢిల్లీలో రసాయన శాస్త్రవేత్తల సమావేశం జరిగింది. ప్రతిభావంతులందరితోపాటు ఎం. ఏ.కి ఆహ్వానం వొచ్చింది. స్వభావరీత్యా అతను వెళ్ళడానికిష్టపడలేదు. విద్యార్థులు, మిత్రులు, తల్లిదండ్రులు, మందార అంతా ఎంతో వొత్తిడి చేసేరు వెళ్ళమని. ఇక తప్పలేదు. వెళ్ళేడు.

అక్కడ అతనికి మిత్రులు కాని, చివరికి పరిచయస్తులు కాని ఎవరూ లేరు. ప్రతినిధులందరితోపాటు ఎం. ఏ.కి కూడ ఒక హోటల్లో ఒక గది ఏర్పాటు చేసేరు. మర్నాటి నుంచీ సమావేశాలు ప్రారంభమవుతాయి.

సాయంత్రం సుమారు ఏడు గంటలయింది. గదిలో లైటుకింద కుర్చీలో కూర్చొని పుస్తకం చూస్తూ నోట్సు రాసుకుంటున్నాడు. వరండాలోని లైటు కాంతి మూలంగా తనకి ఎదురుగావున్న గోడమీద ఒక పెద్ద నీడ పడింది. అది నీలం రంగులో వున్నట్టనిపించింది. చటుక్కున వరండా వైపు చూసేసరికి ఎవరో మనిషి గాఢమైన నీలం రంగు సూటు వేసుకొని, బూట్లు చప్పుడు చేసుకుంటూ చకచకా వెళ్ళిపోయేడు.

సరే ఎవరో అనుకున్నాడు; తిరిగి పుస్తకం చూస్తున్నాడు. నీలం సూటు అటెంచి యిటు తిరిగొచ్చి, గబగబ గదిలో ప్రవేశించేడు.

'హలో ఎం. ఏ. ! నువ్వు వొచ్చేవని ఇప్పుడే తెలిసింది. కన్‌గ్రాట్స్ ! డాక్టరేటు తీసుకున్నావుట. వెరీగ్లాడ్. ఎక్కడ పని చేస్తున్నావూ ? ఏమిటి కథా ?' గలగల గచ్చపొద దులిపినట్టు నవ్వుతూ అన్నాడు జోషీ.

చటుక్కున కుర్చీలోంచి లేచేడు ఎం. ఏ. జోషీ రెండు చేతులూ పట్టుకున్నాడు.

'రా — కూర్చో ! ఎన్నాళ్ళకి కలిశాం ! చాలా సంతోషం. కాఫీ తాగుతావా ? పాలా ?' ఆప్యాయంగా అడిగేడు ఎం. ఏ.

'అంతేనా ! ఏదో కానీ ! నువ్వు మాత్రం మజ్జిగ కంటిన్యూ చేస్తున్నావనుకుంటాను' వెకాశ్యంగా అన్నాడు జోషీ.

ఎం. యస్‌సి. ప్యాసయ్యాక జోషీ ఒక పెద్ద ఎరువుల కంపెనీలో ఆఫీసరుగా చేరేడు. అదృష్టం కలిసొచ్చింది. పై దేశాలకు వెళ్ళేడు. డాక్టరేట్ తీసుకొన్నాడు. తిరిగి అదే కంపెనీలో టెక్నికల్ డైరెక్టరయ్యాడు.

'ఈ లాడ్జి బాగులేదు. మా కంపెనీ గెస్ట్‌హౌస్‌కి పోదాం పద. నీకేం బెంగ అక్కర్లేదు.

మీ రెసెప్షన్ కమిటీకి వివరాలు తెలియజేస్తాను. యింక లే !' అన్నాడు జోషి.

'అలా కాదు. ఈ రెండు రోజుల సమావేశాలూ కానీ. తప్పకుండా నీ దగ్గిర ఒకరోజు వుండే వెళతాను' సర్దిచెప్పేడు ఎం. ఏ.

జోషి వెళ్లేడు. రెండు రోజుల సమావేశాలూ ముగిసేయి. ఎం. ఏ. వుపన్యాసం సభలో ఎంతో ప్రశంసల నందుకుంది.

మర్నాటి ఉదయం ఎం. ఏ. తన గదిలో కూర్చొని ఏదో చదువుతున్నాడు.

ఉదయం ఏడయేసరికల్లా జోషి ప్రత్యక్షం అయేడు.

'రెడీయేనా ? పోదాం లే.'

'క్షమించు.'

'నో నో !'

'వినుమరీ ! ఇవాళ తొమ్మిదింటికి పాటియాలా నుంచివొచ్చిన డాక్టర్ రాయ్ నా దగ్గిరకొస్తానన్నాడు. వుండమని చెప్పేడు. ఎలా కాదనగలను చెప్పూ ? అంచేత సాయంత్రం నీ దగ్గిరకొస్తాను. మరోలా అనుకోకు. ఇబ్బంది లేకుంటే ఎవరినైనా పంపించు. లేకపోతే అడ్రసు చెప్పు నేనే వొస్తాను.' సవినయంగా అన్నాడు ఎం. ఏ.

'ఓ. కే. నేనే వొస్తా సాయంత్రం ఆరింటికి. రెడీగా వుండు.'

జోషి వెళ్లేడు. రాయ్ వొచ్చేడు. కొంతసేపు మాటాడి వెళ్లిపోయేడు.

సాయంత్రం ఆరయింది. జోషి కారు పంపేడు. ఎం. ఏ. కారెక్కి వెళ్లేడు.

అల వైకుంఠ పురంబులో అన్నట్టు అదో పెద్ద బంగళా. పాలరాతితో తీర్చిదిద్దినట్టుంది. అందులో ఒకవైపున చివారనొక గది. గదిలో ప్రవేశించి ఎం. ఏ ఆశ్చర్యపోయేడు. కాంతివంతమైన నీలి బల్బులతో, ఆకుపచ్చని కర్టెన్లు, ముఖమల్ తివాసి అతి ప్రశాంతంగా వుంది వాతావరణం. అందులో మధ్య ఒక రౌండు టేబిలుంది. చుట్టూ కుర్చీలు. కుర్చీలమీద నలుగురు కూర్చున్నారు. అంతా అదోమాదిరిగా వున్నారు. మంచి నిషాలో వున్నారు.

ఎం. ఏ ని చూడగానే జోషి గబగబా వొచ్చి, అతని చెయ్యి పట్టుకొని తీసికెళ్లి వాళ్లకి పరిచయం చేసేడు. ఆ వాతావరణం ఎం. ఏ కి చాలా యిబ్బంది కలిగించింది. కాని ఏం చేస్తాడు ? అంతా తమలో కలవమని ఎం. ఏ ని ఎంతో మొహమాట పెట్టేరు— బలవంతపెట్టేరు — ఒత్తిడి చేసేరు. చాలావరకూ నిభాయించుకొచ్చేడు. చివరకి జోషి ఎం. ఏ మీద మత్తుమందు జల్లి మధు గీతోపదేశం చేసేడు. ఆమాయకుడు కాలుజారి కిందపడ్డాడు.

రెండు రోజులలా గడిచేయి. వారం రోజులు శెలవు కోరుతూ ఎం. ఏ. తన కాలేజీ ప్రిన్సిపాల్‌కి ఉత్తరం రాసేడు. ఆ వారం రోజులలో ఎం. ఏ. మధు గీతార్థసారాన్ని బాగా అనుభవించేడు. తిరిగి వచ్చేశాడు. ఆ స్మృతుల ప్రాబల్యానికి ఎం. ఏ. తల వంచేశాడు.

ఒకనాడు ఎం. ఏ. కాలేజీ నుంచి చాలా ఆలస్యంగా ఇంటికొచ్చేడు. మందార అతనికోసం

# నీలి నీడ

ఎదురు చూస్తోంది. తలుపు కొట్టేడు. గబగబ వెళ్లి తలుపు తీసింది మందార. ఏం యివ్వాళ ఇంత ఆలస్యం అని ఆవిడ అడుగుతూంది. అతను జంకుతూ లోపల అడుగు పెడుతున్నాడు. అతని దగ్గిరికెళ్లేసరికి ఏదో మత్తువాసన కొట్టింది. మందార ఆశ్చర్యపోయింది. అతను కొంచెం తూలిపోబోయాడు. భయంగానే అతన్ని పట్టుకుంది మందార.

ఆ కథ రోజూ అలా కంటిన్యూ అవుతూంది. మందార ప్రాధేయపూర్వకంగా బ్రతిమాలింది, ఏడ్చింది — మొత్తుకుంది. కాని మారిపోయిన అతనిలో మరి మార్పురాలేదు. తను తన స్వాధీనం లోంచి తప్పిపోయేడు. శృతి మించింది, అదే వరస. క్రమంగా తండ్రికీ, తల్లికీ ఈ సంగతి తెలిసి పోయింది. వాళ్లు రాతితో కొట్టబడ్డ మట్టి కుండల్లా బ్రద్దలైపోయారు.

కాలం ఆట్టే గడవకుండానే అబ్బులు బెంగతో కన్నుమూసేడు. తల్లి మంచాన పడ్డది.

మితిమీరిన ఈ దురలవాటు మూలంగా ఎం. ఏ. ఆరోగ్యం అతివేగంగా దెబ్బతింది. ఈ ఆకర్షణచేత బంధింపబడ్డ అతన్ని మదిరా తపస్వులైన అతని స్నేహితులు నిత్యం ఉత్సాహ పరుస్తూనే వుండేవారు.

'మాష్టారూ ! మీరెలా అయిపోయారో చూసు కున్నారా ? నా మాట మన్నించి, నేటి నుంచీ ఆ త్రోవనపోకుండా నాతో రండి. నా మాట వినండి మేష్టారూ ?' ప్రాధేయపూర్వకంగా బ్రతిమాలేడు అతని ముఖ్యశిష్యుడు రామేశం.

ఎం. ఏ. ఒక నవ్వు నవ్వేడు దీనంగా —

అతని ఆరోగ్యం ఏమీ బాగులేదు. రామేశం ఒక డాక్టర్ని తీసుకొచ్చి చూపించేడు. డాక్టరు అతన్ని పరీక్ష చేసేడు. ఉదరకోశం పూర్తిగా చెడిపోయింది. నరాలు పటుత్వాన్ని కోల్పోయేయి.

డాక్టరు యివతలకొచ్చేడు. రామేశం కూడా వొచ్చేడు.

'ఇంక చెప్పడానికేం లేదు. ఒకటి రెండు రోజులకంటె వ్యవధిలేదు' అంటూ వెళ్లిపోయేడు డాక్టరు.

రామేశం లోపలికివెళ్లి మందారకి లేని ధైర్యం చెప్పేడు.

రాత్రి పన్నెండు దాటింది ఎం. ఏ. ఆఖరి శ్వాస విడిచిపెట్టేడు. అక్కడేవున్న రామేశం మరో ఇద్దరు స్నేహితులు మందారను అతికష్టంమీద ఓదార్చి ఆపదలో ఆదుకున్నారు.

మాష్టారు ఓ వేడి నిట్టూర్పు విడిచేరు.

నేనన్నాను తిరిగి —

దూరాభారంలో వుండటం నుంచి నేను చాలా కాలంవరకూ ఎం. ఏ.ని కలుసుకోలేకపోయాను. ఏదో ఆఫీసు పనిమీద మా ప్రాంతం వెళ్లేను. అసలు బయల్దేరేముందే ఒకసారి మా వూరు వెళ్లి ఎం. ఏ.ని కలుద్దామని అనుకున్నాను. కలెక్టరు ఆఫీసుకెళ్లేసరికి నాకు చిరపరిచితుడైన రామేశం తండ్రి కనిపించేడు. మాటల సందర్భంలో ఎం. ఏ. ప్రసక్తి వొచ్చింది. అప్పుడు చెప్పేడు అతను ఎం. ఏ. గురించి తన కొడుకు చెప్పిన వివరాలన్నీ.

నాకు మనస్సు మనసులో లేదు. వెంటనే పని ఆపి మా వూరు చేరేను. రిక్షా ఎక్కి వూరికి మొదట్లోనే వున్న సత్రం ప్రక్కనేవున్న పెద్ద వీధిలోని చిన్న సందులోకి వెళ్లి ఎం. ఏ. యిల్లు చేరుకున్నాను. తలుపు వేసివుంది. ఎవర్ని పిలవాలి? ఎలా పిలవాలి? ఎన్నో ఆలోచనలు ఎన్నో సందేహాలు. చివరికి తలుపు తట్టేను. మెల్లగా తలుపు తెరుచుకుంది.

చుక్కలేని ఆ చక్కదనాల చుక్క మొహం మీద విషాదచ్ఛాయలలముకున్నాయి. నేనేం అడగాలి! ఆవిడేం జవాబు చెప్పాలి. నేనో నిట్టూర్పు విడిచేను. ఆవిడ రెండు బాష్పకణాలు రాల్చింది. ఆవిడ ఒక కుర్చీ చూపించింది. నేనచేతనంగా నించున్నాను. అప్పుడు ఆవిడే అంది —

'మీ ఫ్రెండు వెళ్లిపోయారు. చావు బ్రతుకుల మధ్యనున్న వాళ్లని బ్రతికించడం కోసం ఆఖరి వైద్యంగా ఏదో ఆశతో గొంతులో గరళం పోస్తారని అంటారు. కాని మీ ఫ్రెండు గొంతులో బలవంతాన గరళం పోసి చంపేరు వారి స్నేహితులు. పెద్దలూ, పిన్నలూ, పురుషులూ, స్త్రీలూ ఎంతోమంది భయంకరమైన ఈ ప్రవాహంలోపడి కొట్టుకు పోతూంటే ఎందరిని అనగలం ! ఎవరిని ఆపగలం ! చెప్పండి' అంటూ రెండు కన్నీటిబొట్లు రాల్చింది ఆ మందభాగ్యురాలు.

నేను కుంగిన హృదయంతో ఆవిడ దగ్గిర శెలవు తీసుకున్నాను.

'మాష్టారూ నే వెళ్లివస్తా' అన్నాను. ఆయన తలదించుకొనే నాతో వీధి గుమ్మం వొచ్చేరు.

## ప్రకృతి - పరమాత్మ

బాలభానుని బంగారు
మరీచి మాలికలందు,

గాలికి గలగలలాడు
హరిత వర్ణ పత్రాలయందు,

అందముగా అరవిరిసిన
సుగంధ సుమాలయందు,

హాయిని గూర్చుచు వీచు
మంద మందానిలమందు,

కాంచవచ్చును కరుణామయుని
కమనీయ ముఖము,

ఆలకింపదగు అనంతుని
ఆనందకర వాక్కులు.

— వేంపాటి సోమరాజు




"ఎందుకంటే మేము సూపర్ డస్ట్ టీనే వాడతాం. దానియొక్క చిక్కటి డికాక్షన్, అమోఘమైన రుచి మా అందరికి ఎంతో నచ్చుతుంది. అదిగాక అది వాడితే చాలా మితవ్యయం కూడా. సూపర్ డస్ట్ టీ తప్ప మరియే యితర టీ మా కుటుంబంలో వాడేందుకు వొప్పుకోరు. అందుకని మా కుటుంబం "సూపర్" కుటుంబం అని పిలువబడుతుంది."

**సూపర్ రుచి. సూపర్ డికాక్షన్. సూపర్ మితవ్యయం.**

## బ్రూక్ బాండ్
# సూపర్ డస్ట్

భారత దేశంలో అత్యధికంగా అమ్మబడుచున్న ప్యాకెట్ టీ

# సుబ్రమణ్యంగారి కుటుంబం ఎందుకు 'సూపర్' కుటుంబం అయింది?

HTC-881-31

(గత సంచిక తరువాయి)

"అదేం పిచ్చి ప్రశ్న. 'నేను కాకుండా ఈ మేడలో యింకెవరుండినా నీ విలాగే చేసేవాడివా!' అంటే ఏం జవాబుచెబుతావు? పరిస్థితులు యిలాగే వస్తే యీ శకుంతల కాకుండా మరో నీల, కుంతల ఎవరుండినా నీవు యిట్లాగే వచ్చేవాడివి. అలాగే నీవు కాకుండా మరింకే వ్యక్తి అయినా నన్ను ఆకర్షించి, నాచే ఆకర్షింపబడి, యింత సాన్నిహిత్యంగా రావటం తటస్థిస్తే, అతన్నయినా యిలాగే అడిగివుండేదాన్నేమో!..."

మనసు మారుమూలల్లో ఎక్కడో చివుక్కు మన్నట్టు అనిపించినా, శకుంతల చెప్పింది వాస్తవమే అనిపించింది.

ఇక్కడ ప్రాధాన్యం వ్యక్తికికాదు. పరిస్థితుల మూలంగా ఒకదానికొకటి దగ్గరగా వచ్చి కలిసిపోయే మనసులకే మరి. అట్లాంటి మనసులున్న ఏ వ్యక్తులయినా యిట్లాంటి పరిస్థితులలో యిలాగే చేయవచ్చు.

"ఏమిటి ఆలోచిస్తున్నావు? నేనన్నది తప్పుగా వుందా." భుజంమీద తల ఆనిస్తూ అంది.

"లేదు. నీవన్నది రైటే." మనస్ఫూర్తిగానే అన్నాను.

"శంకరం. నాలోవున్న బాధ, అందు మూలంగా నేను తీసకున్న నిర్ణయంచెప్పాను. నీవు కాదననే నా ధైర్యం."

"కానీ... చూద్దాం..."

అక్కడనుండి వచ్చేసినప్పటినుండి నా మనస్సులో ఈ సమస్య వేధిస్తూనే వుంది. ఏపని చేస్తున్నా... ఎక్కడ కూర్చున్నా... నా తలలో ఆలోచనలు ఒక కొలిక్కి రావటంలేదు. సముద్రంలో అలల్లాగ అల్లకల్లోలంగా వెల రేగుతున్నాయి. ఒడ్డును అందుకోలేక ఓడి పోయి వెను తిరిగి పోయినట్లు, ఒక తీరుకు రాక మళ్ళీ మళ్ళీ కలసిపోతున్నాయి గజిబిజిగా.

బాధ్యతల బరువుతో కుంగిపోతూ నిస్సారంగా గడిపే యీ బతుకులో శకుంతల నాకు ఒక వరం. ఆమె సమక్షంలో యివన్నీ ఎలా మరుపుకు వస్తాయో అనూహ్యం. ఈ బాధ్యతల నుండి నన్ను విముక్తుణ్ణి చేస్తానంది. ఆ బరువును నామీద నుండి తొలగించి, అందుకయ్యేఖర్చు తను భరించి... బ్రతుకంతా తన సాన్నిధ్యంలోనే గడుపుకొనే వరం తనే తను యిస్తోంది. ఆలోచించి చెబుతానటం... మోకాలొడ్డటమే అవుతుంది.

# అనుబంధాలూ - అంతఃకరణాలు

తెనాలి సుశీలాదేవి



ఆమిచ్చే డబ్బుతో నా వాళ్ళందరి సమస్య తీరి పోతుంది. నన్ను కొనటం లేదు. కోరి వరించి తీసుకుపోతానంటోంది...

ఆ వేళంతా ఏ పనీ మనసు పెట్టి చేయలేకపోయాను. స్కూలుకు సెలవు పెట్టేశాను. యింట్లోనే వుండిపోయాను.

నా పరధ్యాన్నం, అస్తవ్యస్తపు పనులు గమనించినట్లే వుంది రాజ్యం.

ఒకటి రెండు మార్లు అడిగింది 'అదోలా వున్నారే'మని.

ఏమని చెప్పేది ? చెబితే ఏంచేస్తుంది ? ఏడుస్తుందా ? ఆ నీరసపు గుండె పగిలి పోతుందా...వూహించలేకపోయాను.

ఎటూ తేల్చుకోలేక ఆ మరుదినం కూడా సెలవుపడేసి శకుంతల ముందు వాలాను.

''ఏమిటి శంకరం, లంఖణాలు చేసినట్లు అలా వాడిపోయావేం'' ఆప్యాయంగా నా చెంపలు, జుట్టు నిమిరింది

రాత్రంతా యీ ఆలోచనతోనే క్షణం కూడా నిద్రపోలేదని చెబితే తను నవ్వుతుంది. 'యింతగా ఆలోచించాలా' అని బహుశా కోపం కూడా రావచ్చు, తను వెనుకాడుతున్నందుకు.

రాత్రంతా నన్ను వేధించిన సమస్యలు గానీ, నిద్రలేక వడలినట్లున్న నా శరీరంలో అలసటగానీ నాకు కొన్ని క్షణాలపాటు గుర్తుగాలేదు. అలా రాకుండా చేయగలిగిన శక్తి శకుంతలకే వుంది.

ఆ తరువాత అడిగింది 'ఏంచేశావు ?'

జవాబు యివ్వలేకపోయాను.

'శంకరం ! భయపడుతున్నావా ?... సరే యిప్పుడే వస్తానుండు'' లోపలికి వెళ్ళింది తను.

కళ్ళుమూసుకుని అలసటగా దిండు నానుకుని పడుకున్నానలాగే.

''యిలాచూడు''

చప్పున కళ్ళు విప్పాను చూసిన మరుక్షణం చటుక్కున లేచి కూర్చున్నాను. నా కళ్లముందు నోట్లకట్టలు. వందలు, వేలు అంతడబ్బు నేనెప్పుడూ చూసినట్లు గుర్తులేదు.

''శంకరం, యిప్పుడు చెప్పు ? యిదంతా యీ క్షణంలో నీకు యిచ్చేస్తాను. నీ వాళ్ళకెవరెవరికి ఎంతెంత అవసరముందో దానికి మించి యిచ్చేయి. నీవు లేని లోటు వాళ్ళకు తెలియకూడదు. నాకున్నదంతా యిచ్చేస్తున్నాను. యిదిగో యిలా చూడు...'' జిగేలుమన్నాయి నా కళ్ళు.

చిన్నపెట్టెనిండా బోలెడు నగలు. వంకీ, వడ్డాణం, కాసులపేరు, గాజులుతప్ప మిగిలినవన్నీ ఏం నగలో, వాటి పేర్లేమిటో కూడా నాకు తెలీదు. అయోమయంగా చూశాను.

''యీ నగలన్నీ మనతో తీసుకుపోదాం. ఎక్కడయినా సర్దుబాటు చేసుకొనేవరకూ యిబ్బంది పడకుండా వుపయోగపడతాయి.''

ఆత్రుతగా అంటున్న శకుంతలకేసి ఆ డబ్బుకేసి, నగలకేసి చూస్తుంటే నా నోట్లో మాటే రాలేదు. తల వూపాను. ఆ మాత్రానికే ఆ ముఖంలో వెలుగు తెరలు...

'శంకరం, శంకరం' అంటూ నా తల, ముఖం ముద్దులతో నింపేసింది ఈ అందం కోసం, యీ ఆనందంకోసం, యీ అనుభవం కోసం ఏమయినా చేయొచ్చు ననిపించింది నాకా క్షణంలో.

ఇంటికి వచ్చేస్తున్నపుడు డబ్బున్న చిన్న సూట్‌కేస్ నా చేతుల్లో పెట్టింది శకుంతల. తన కళ్ళలోకి ఒక్కసారి చూసి మరేం మాట్లాడకుండా బయలుదేరాను. ఆ క్షణాన శకుంతల హృదయం పురి విప్పిన మయూరిలా నాట్యంచేస్తూంటుందని నాకు తెలుసు.

ఆ రాత్రి రాజ్యాన్నికూడా వడ్డించుకోమని కలిసి భోజనం చేశాను. ఆ మాత్రానికే ఆ ముఖం కలకల లాడినట్లు కనిపించింది— నా భ్రమ కూడానేమో!

పక్కలేసే వరకు హుషారుగా తిరిగినట్లు తోచింది. రాజ్యం మంచంమీద పక్కగా వచ్చి

కూర్చోగానే నన్ను చూసి ఆశ్చర్యపోయిందో, ఆనందం పొందిందో సరిగ్గా చెప్పలేను. అకాల వర్షం అనుకుంటోందేమో మనసులో.

ఎండి బీటలువారిన ఆ హృదయానికి తొలకరి జల్లులా శాంతినిచ్చి వుంటానను కుంటాను. ఎందుకంటే ఆ ముఖంలో, కళ్ళల్లో చైతన్యం, కళ... హృదయంలో ఆ రాగజలధి పొంగు తట్టుకోలేనట్టు నా మెడ చుట్టూ చేతులు వేసి మీదకు లాక్కుని కావలించుకుంది. ఆ వుద్రేకమో, మరి సంతోషమో, బాధో... ఆ కళ్ళు తడిసి... మెరిసి... నా గుండెను కూడా తడుపు తున్నట్టు అయి...నా గుండె ద్రవిస్తోందా... చప్పున మనసు తెరమీద శకుంతల పత్యక్షమై పిలిచినట్టయింది.

"రాజ్యం! నే నేమయినా అయిపోతే... నీవు..."

"ఎందుకా మాటలు..."

మాటలు చెవుల బడినంత మాత్రాన దుఃఖపుతెర... చిగురుటాకులా కంపనం మనిషిలో

"నీకు చాలా డబ్బు వస్తుందనుకో..."

"నే నెప్పుడయినా నాకు ఫలాన కావాలని అడిగానా? నాకు డబ్బెందుకు? ఏంచేసుకోను? మీ కళ్ళముందు యిలా కరిగిపోనీండి నా జీవితం." గుండెల్లో తల దాచుకుంది.

డబ్బెందుకు... డబ్బెందుకు... అంటా రేమిటి వీళ్ళు. డబ్బో డబ్బో అని అందరూ ఏడుస్తూంటే.

## అనుబంధాలూ — అంతఃకరణలు

ఈ డబ్బంతా తీసికెళ్ళి యిప్పుడు తన వాళ్ళకు యిచ్చేస్తే... ఓహో... వాళ్ళ ముఖాల్లో సంతోషం... సంతృప్తి... వాళ్ళ జీవితమంతా వెలుగురేఖ...అయితే విచిత్రంగా యిటు రాజ్యం... అటు శకుంతల... డబ్బు వద్దట... మరి? నా కెందుకో నవ్వొచ్చింది.

రాజ్యం అలసటగా నిద్రపోతోంది. నిద్రలో కూడా... శుష్కించిపోయిన ఆ బుగ్గల్లో, మూసుకున్న ఆ లోతు కళ్ళల్లో ఏదో తన్మయత్వం చెందుతున్నట్టుగా కనిపించింది.

లేచి వెళ్ళి డబ్బు సూట్‌కేస్ తెరిచాను. లెక్క పెడదా మనుకున్నాను. విసుగొచ్చింది. లేచి వెళ్ళి మంచం మీద పడుకున్నాను. నిద్ర రావటంలేదు. ఒక క్షణం రాజ్యం... మరో క్షణం శకుంతల సినిమాలో లాగ కనిపిస్తున్నారు

కట్టలు కట్టలు డబ్బు పట్టుకుని ఒళ్ళంతా నగలు దిగేసుకున్న శకుంతల, "యివన్నీ నీ కోసం తెచ్చించుతాను, నాతో వచ్చేయవూ!" బ్రతిమాలుతోంది.

"మీకు నేనేం ఇవ్వలేను నన్ను మీతో వుండనీయరూ" దీనంగా రాజ్యం.

నిజం. రాజ్యానికి ఏ సంపదా లేదు. సంపదల్లోకి భర్త కూడా లెక్కవచ్చేటట్లయితే నేనొక్కడినే ఏకైక సంపద తనకు. నిజానికి నన్ను చేసుకుని రాజ్యం సుఖపడిందెక్కడ? ఆడది అభిలషించే సుఖాల్లో నగలూ, చీరలూ ప్రథమ స్థానం వహించేవే అయితే రాజ్యానికి పిసరంత సుఖం కూడా దక్కలేదని చెప్పాలి. అనువైన వీలొక్కటి కొనలేక పోయాను. ఇక నగలు సరేసరి! ఎదుటివాళ్ళ ఒంటిమీద, సినిమాల్లోనూ చూసి మురిసిపోవలసిందే. గంపెడు సంసారం ఈదుతున్న నాకు భార్యగావచ్చింది! నగలూ, చీరలూ అటుంచి ఏ శాంతికూడా కరువు చేసుకుని నా మనుష్యుల కోసం గొడ్డులా చాకిరిచేసి, ఆరోగ్యం కూడా పాడుచేసుకుంది నాకీవూరు ట్రాన్స్‌ఫరయి వచ్చాక, యిక్కడ ఒంటికాపురం పెట్టటంతో కొంత పుంజుకోగలిగింది. కాని, చిత్రంగా యిక్కడ శకుంతల అవతరించి నన్ను బలంగా ఆకట్టుకోటంతో కథ మలుపు తిరగబోతోంది.

తనకున్న ఒకేఒక్క ఆభరణమయిన నేను వెళ్ళిపోయాక రాజ్యం ఏం చేస్తుందో? ... యిలా చేయవచ్చు'అని నాకు తోచిన రకంగా అనుకోబోతే పొందటంలేదు. 'పోతేపోనీగాడు. కొరత లేకుండా బోలెడు డబ్బు నయినా యిచ్చాడు' అనుకుంటుందా? మనసొప్పలేదు. మరి . మరి... రాజ్యం ఏమయిపోతుంది?

ఏమయినా ఐపోతుందనుకోటానికి భయం వేసింది.

నన్ను చేసుకున్న నేరానికి ఏదైన ఐపోవటమే రాజ్యానికి శిక్షా?

మరి...శకుంతల...

ఆలోచనల తీవ్రతతో నా మస్తిష్కం వేడెక్కిపోయింది. ఏంచేసు లన్నా తోచటం లేదు. ఏం చేయకుండా వుండటానికి వీలు పడదు. ఏదోచేయాలి...ఏదోచేయాలి ... అదే ఏమిటి చేయడం...

నేను శకుంతలతో వెళ్ళిపోతే యీ రాజ్యం బలహీనపు గుండె తట్టుకుంటుందా? ఆగిపోదు కదా!

పోలేకపోతే...శకుంతల...నన్ను... పరాయి వాడినయిన నన్ను నమ్మి, తన సర్వస్వం ధారపోసి, తన కాపురం వదులుకుని రావడానికి సంసిద్ధంగా వున్న శకుంతల ఏం చేస్తుంది? వూహించకుండా వుండలేకపోతున్నాను. వూహాలను భరించనూ లేకున్నాను మనసుని తినేసే ఆలోచనల బారినుండి తప్పుకుని కాసేపు విశ్రమించాలని పిస్తోంది. కాని నాకు నిద్రపడుతుందా !?

సముద్రంలోని సుడిగుండాలులా నా ఆలోచనలు అక్కడికక్కడే తిరుగుతూ బయట పడలేక నా మనసు అల్లకల్లోలమైపోయింది.



డిసెంబర్ నెలాఖరున హైదరాబాదులో శ్రీకృష్ణ దేవరాయ ఆంధ్రభాషా నిలయంలో 'మినీకవితా విప్లవం' ఆవిష్కరణ సభలో వేదికపై ప్రసంగిస్తున్నది శ్రీ త్రిపురాన రాఘవదాసు. ఇంకా శ్రీయుతులు అద్దేపల్లి, ఎల్లోరా, డా. దాశరథి, కొల్లూరి, పోతుకూచి సాంబశివరావులను చూడవచ్చును.

# ఆరోగ్యం, మజా, జోరూ తోడు జోడుగా!

బోర్న్‌విటా తీసుకోండి...మనస్సులో వుల్లాసం మరియు ముఖములో సంతోషపు వెలుగులు నింపుకోండి. మీ కుటుంబానికి రుచికరమైన బోర్న్‌విటా యివ్వండి. బోర్న్ విటాలో కోకో, మాల్ట్, పాలు, పంచదార లాంటి పదార్థాలు సమృద్ధిగా వున్నాయి. దీన్ని తయారు చేసింది 100 సంవత్సరాలకు పైగా ఆరోగ్య పానీయాలు తయారు చేయడంలో ప్రత్యేకత గణించిన క్యాడ్‌బరీ వారు.




## క్యాడ్‌బరీస్ బోర్న్‌విటా

దీన్లోని మంచి లక్షణాలన్నీ మీకోసం

తక్కువ ధరగల రీఫిల్ ప్యాక్‌లలోకూడా దొరుకుతుంది!

(OBM/5632 TL)

వ్యవధి తక్కువ. తెల్లారేసరికి నేను శకుంతల దగ్గరికి వస్తానని చెప్పాను.

తల ఒక్కసారి విదిలించాను కల్లోలం రేపుతున్న ఆలోచనలను ఒకమూలకు నెట్టాను. కొన్ని నిముషాల పాటు ప్రశాంతంగా ఆలోచించాను.

రాజ్యం...రాజ్యంతో నా పెళ్ళి.. రాజ్యంతో నా కాపురం ... ఎంత రాత్రయినా భోంచేయకుండా ఎదురుచూస్తూ వీధిలో చలిలో కూర్చునివుండే రాజ్యం ...



## అనుబంధాలూ – అంతఃకరణలు

"ఎంతడబ్బయినా సరే నాకున్నదంతా మీవాళ్ళకిచ్చేసిరా! శంకరం నీవు వస్తావనే ఎదురు చూస్తుంటాను". అనే శకుంతల మాటలు... తనతో పరిచయం ... విలక్షణమయిన ఆ సౌందర్యం ... నా బాధలన్నిటిని కొన్ని క్షణాలసేపు మటుమాయం చేయగల ఆమె సాన్నిహిత్యం... నాతో సుఖజీవనంకోసం లక్షల డబ్బును, వెలకట్టలేని చేసే బంగారాన్ని తృణప్రాయంగా వదిలేయగల ఆమె అనురాగం, సాహసం చాలాసేపు దాదాపు అర్ధరాత్రి దాటాక కూడా నేను యీ సుడిగుండంలోంచి బయట పడలేక సతమత మయ్యాను.

తెల్లవారుఝామున, ఆ బ్రహ్మ ముహూర్తంలో నాకు 'జ్ఞానోదయమైంది' అనేంత గొప్ప పదం వాడలేనుగానీ, నాకు పరిష్కారం గోచరించింది. జ్ఞానమో, అజ్ఞానమో, హితమో, అహితమో, కష్టమో, సుఖమో, ఏదిన్యాయమో, ఏదన్యాయమో, మంచో, చెడో, లాభమో, నష్టమో బేరీజు వేయలేకపోయాను గానీ ... సముద్ర మథనం లాగా నా అంతరంగాన్ని మధించిన పిదప నాలో వుదయించిన యీ పరిష్కారం ఒకరికి అమృతాన్ని, మరొకరికి హాలాహలాన్ని యిస్తుందని తెలిసినా, ఈ రెండింటిని సమానంగా నేను నా గుండెల్లో భరించాలనే వాస్తవం కళ్ళకు కట్టినట్టు కనబడుతూనే వున్నా ఇదే సరైనదన్న నిర్ణయం నాకు కొంత శాంతిని ప్రసాదించింది. కాగితం, కలం తీసుకుని అప్పటికప్పుడు వుత్తరం వ్రాశాను.

"ప్రియమైన శకుంతలా!

ముందుగా నన్ను క్షమించమని కోరుతూ వుత్తరం మొదలుపెడుతున్నాను. నాకు బదులుగా వుత్తరం నీ ముందు కొచ్చేసరికే సగం కృంగిపోయివుంటావు. నాకు తెలుసు. మనిద్దరిమధ్య పరిచయం, ఏర్పడిన ఆకర్షణ, బిగిసిపోయిన బంధాలు, మైమరపించిన అనుభవాలు, మళ్ళీ మళ్ళీ యిందులో వ్రాసి వర్ణించటం నిన్ను మరింత బాధ పెట్టటమే అవుతుంది. మనిషిని, మనసును రంపపు కోతకు గురిపెట్టే మాటలు రెండుముక్కల్లో చెప్పినా, రెండు వాక్యాల్లో వ్రాసినా, వర్ణించి వర్ణించి గంటసేపు సాగదీసినా కలిగే బాధ మాత్రం ఒకటే.

రాత్రి నీ సమక్షం నుండి వచ్చేశాక నేను చాలా ఆలోచించాను– జీవన్మరణ సమస్యలాగ

నన్ను వేధించిన సమస్యకు, నేను తీసుకున్న నిర్ణయం అనాలోచితము కాదు. తొందరపడి నిర్ణయించుకున్నది కాదు. బాగా ఆలోచిస్తే నీవుకూడా ఒప్పుకుంటావు.

నీకు అందం వుంది. ఆకర్షణవుంది ... దేన్నయినా సాధించుకోగల ఐశ్వర్యం వుంది. అఫ్ కోర్స్ ఆ ఐశ్వర్యం నాకోసం ధారపోస్తా నన్నావనుకో. కాని నీ విషయం, నీలో నామీద నున్న ప్రేమానురాగాలు, మరిచిపోయి, నీలోని స్వార్థం కొంచెం పక్కకు తొలగించి రాజ్యం గురించి ఆలోచించి చూడు.

రాజ్యానికి ఆలోచనల నిండా నా రూపం తప్ప, గుండెనిండా నామీద అనురాగం తప్ప మరేంలేని పేదరికం. నీవు నాకోసం ధారపోస్తున్న సంపద నన్ను నీకు దగ్గర చేయొచ్చు. కాని, ఆ సంపద తనకు ఆనందం కలిగించకపోగా, పైగా తను యిన్నాళ్ళుగా దాచుకున్న పెన్నిధిని దొంగిలించుకు పోయిందని తెలిస్తే, రాజ్యం గుండె పగిలి పోయి చచ్చిపోయినా ఆశ్చర్యపోనక్కరలేదు. తన గుండెల్లో దాచుకున్న యీ పెన్నిధిని అష్టయిశ్వర్యాలు యిస్తామన్నాసరే ధారపోయ లేని అమాయకురాలు.



ఏలూరులో నాట్యంచేసి అందరి ప్రశంసలు అందుకున్న కుమారి కె. సూర్యలత

ఒక నిజం చెప్పనా! రాజ్యానికి అందం లేదు. ఆకర్షణలేదు. సంపదలయినా లేవు. వుండివుంటే బహుశా నేను నీతో వచ్చేసే వాడినేమో! తన అందంతోనో, ఆకర్షణ తోనో, డబ్బుతోనో మరోజీవితం, మరోతోడు సంపాదించుకోగల నేర్పు వుండి వుండినా బాగుండేది. కాని నేను తప్ప మరే అండలేని అమాయకురాలు, నిస్సహాయురాలు, అబల— రాజ్యం. ఎక్కడోపుట్టి తన వారి నందరినీ వదులుకొని, సూత్ర బంధంతో తనకు తాను అర్పణ చేసుకుని నాకు భార్యగా నా యింటికి యిల్లాలుగా వచ్చి యీ ఎనిమిదేళ్ళుగా మాకు సేవలు చేసింది. ప్రతిఫలంగా నా నుండి ప్రేమ, అనురాగం తప్ప మరేం కోరని ఆడది ...

యింత బాధలో నా రాజ్యం గురించి చెబుతూంటే నీకు కోపం వస్తూంది కదూ! కాని శకుంతలా! రాజ్యానికి లేనివి ఎన్నో నీకు న్నాయి. నీ అందం, సొగసు, నీలోని ఆకర్షణ ఎవరినయినా నీ పాదాక్రాంతుణ్ణి చేస్తాయి. కాకపోతే నేనే దొరకటం నీ దురదృష్టం. నీ సాహచర్యంలో నేను పిచ్చివాడినయిన మాట నిజమే. కాని... కాని... రాజ్యానికి నేను లేక పోతే బ్రతికే మార్గమే లేదు. దానికి తెలివి తేటలే కాదు, తన బ్రతుకు తాను బ్రతకగల ధైర్యం గానీ, మరో తోడు చూసుకోగల మనస్థయిర్యం గానీ, తన చూపుల వెంట అయస్కాంతంలా మరొకర్ని రప్పించుకోగల అందచందాలుగానీ ఏవీ లేవు. విలాజీవిస్తుంది చెప్పు? కావలసినంత డబ్బు కుమ్మరిస్తా నంటావు. ఆ డబ్బే మనిషికి, ఆనందాన్ని తృప్తిని, జీవించాలనే కోరికను కలిగిస్తుందని నీవు అనుకుంటే అది పొరపాటు కాదా? అదే పరమార్థమయితే నీవు దాన్ని తృణప్రాయంగా దెచ్చించి నా కోసం వచ్చేయగలవా ?

శకుంతలా! నా మాటలు నీకు కఠినంగానే తోస్తాయి. బాగా ఆలోచించి చూడు. నిన్ను నిరాశ పరచినందుకు నన్ను క్షమించు. క్షమించక పోయినా అది కూడా నా నేరానికి తగిన శిక్షే. నీకు అందం వుంది. నీలో గొప్ప ఆకర్షణ వుంది. నీవు కోరుకుంటే, కావాలను కుంటే ఎవరయినా నీ వెంటపడి వస్తారు. నామీద కలిగే ఈ కోపాన్ని మరచిపోయి నీ జీవితావసరాన్ని గమనించు. అయితే మరోసారి యిలాంటి పొరపాటు చేయకుండా, నా లాంటి బలహీనుడిని ఎన్నుకోకుండా నీ కోరిక తీర్చ గలవాడిని చేరదీయి. ఇది నీ గుణ శీలాలను ఎత్తిపొడుస్తూ అనే మాట మాత్రం కాదు. నేను నీతో రాలేక పోయినంత మాత్రాన నన్ను తక్కువగా అంచనా వేయకు. నా జీవితాంతం నీ స్మృతి నా గుండెల్లో వుంటుంది. నీకు కలిగించిన ఆశాభంగం ముల్లులా నన్ను పొడుస్తూనే వుంటుంది.

నేను తప్ప మరేమీ లేని రాజ్యాన్ని వదలి రాలేను శకుంతలా! ఆ అమాయకురాలిని నిస్సహాయురాలిని చేసి, భర్త వదిలేసిన ఆడ దానిగా, సంఘంలో దాన్ని వెర్రిదానిగా మార్చి నేను రాలేను...రాలేను. రాలేకపోతున్నందుకు నన్ను క్షమించు. అలా రాగలిగితే జీవితాంతం ఆ నేరం నన్ను దహిస్తుంది. నీ ఎడలమాత్రం ద్రోహం కాదా ? అంటావేమో. ద్రోహమే. కాదనను. నీవే ఆలోచించి చూడు ఏది న్యాయమో, ఏది ద్రోహమో! నీవు కావాలని కోరుకుంటే నీవు ఆశించింది పొందటానికి ఎన్నో మార్గాలున్నాయి. నేనే వుండాలనిలేదు. కాని నేను లేకపోయినప్పుడు రాజ్యానికి మరణం తప్ప మరో మార్గంలేదు శకుంతలా!

నీ ఆశలు వమ్ము చేసినందుకు యీ అభాగ్యుణ్ణి క్షమించు. నీ జీవిత నౌకకు మరో మంచి నావికుడు దొరకాలని ఆ భగవంతుణ్ణి ప్రార్థిస్తాను.

ఇట్లు

శంకరం."

ఉదయమే మడిచిన ఆ వుత్తరం, డబ్బు పెట్టె తీసుకుని శకుంతలకు అందజేయాని బయలుదేరాను. మురళికిస్తే ఆవిడకు చేర్చ గలడు. శకుంతలకు ఎదురుపడే సాహసం నాకు లేదు. రాజ్యంతో చెప్పి సామాన్లన్నీ సర్ది యిక్కడి నుంచి వెళ్ళిపోవాలి ఈరోజే! శలవు పెట్టి ట్రాన్స్‌ఫర్ చేయించుకోవాలి యిక్క డుంటే శకుంతల మరో శంకరాన్ని వెతుక్కుం దనే మాటగానీ, లేదా ఆత్మహత్య చేసుకుం దనిగానీ యీ రెండిట్లో ఏదీ నేను వినలేను. భరించలేను.... అందుకే... అందుకే...యీ వూరు వదిలేయాలి.

మురళి ఎప్పుడొస్తాడా అని స్కూలుగేటు లోనే కాచుకున్నాను.

(అయిపోయింది)

# సీరియల్

# రాగలహరి

**శ్రీమతి మాధవపెద్ది పుణ్యశీలాప్రసాద్**

## 18

(గత సంచిక తరువాయి)

అసలు పెళ్ళయి రాగానే గుదిబండ లాంటి ఈ పిల్లని చూస్తూనే వళ్ళు మండింది రత్తమ్మకు. "రెండో పెళ్ళి చేసుకున్నది చాలక పైగా ఈ ఆడపిల్ల బరువు ఒకటా?" అని చీదరించుకునేది.

చిన్న భార్యని మచ్చిక చేసుకోవడానికి, ఆవిడ అడుగులకు మడుగులొత్తేవాడు వేదాంతంగారు.

"ఏదో గుప్పెడు మెతుకులు పడేస్తుందు. వయసు రాంగానే దాని మేనమామ వున్నాడు. వాడికిచ్చి, కట్టేసి పంపించేద్దాం ఇంట్లోంచి —" అంటుండేవాడు వేదాంతంగారు.

సరే కదా అని వూరుకునేది రత్తమ్మ.

గీతికకి వయసు రాంగానే, ఆ మేనమామని పెళ్ళి విషయం అడిగితే — సుముఖంగానే వున్నాడు. కానీ చదువు పూర్తవాలన్నాడు.

ఇంకా కొన్నాళ్ళు గీతికని ఇంట్లో వుంచుకోవాలనీ, తిండి పెట్టాలనీ, గునుస్తూనే వుండేది రత్తమ్మ.

కానీ, ఆ టైములోనే ఆవిడకి పిల్లలు పుట్టడం ప్రారంభించారు. వెంట వెంటనే కాన్పులవడంతో — వాళ్ళపోషణంతా గీతిక పైనే పడింది.

ఇంటెడు చాకిరీ చేస్తున్న గీతిక క్షణం లేకపోతే ఇరుకున పడసాగింది రత్తమ్మ.

చదువు పూర్తి చేసిన గీతిక మేనమామ, ఉద్యోగం రావాలన్నాడు. అదృష్టవశాత్తూ మంచి ఉద్యోగం వచ్చింది. ఆ తరువాత ట్రైనింగ్ అవాలి— అన్నాడు— ప్రొబేషన్ అన్నాడు— మొత్తానికి పెళ్ళి వాయిదా పడుతూ వచ్చింది.

**జరిగినకథ — 8 :** ఆదర్శ దాంపత్య జీవితం సాగిస్తున్న చరణ్, పల్లవిలకు సంవత్సరాలు గడుస్తున్నా పిల్లలు కలగక పోవటంతో, బంధువుల దృష్టంతా వాళ్ళ మీదే వుండేది. కొంత కాలానికి పల్లవికి 'గొడ్రాలు' అన్న పేరు స్థిరపడి పోయింది. ఓ శుభ ముహూర్తాన ఆమె కడుపు తొందన్న వార్త ఆ దంపతులను ఆనంద పరచినా, బిడ్డ నెత్తుకునే వరకూ నమ్మకం లేదేమో! అన్న అనుమానం వాళ్ళని విచార సాగరంలో ముంచెత్తుతూ వుంటుంది. చరణ్ పల్లవిలకు పుట్టిన పాపకు 'శృతి' అని పేరు పెట్టుకొంటారు. చరణ్‌కి ప్రమోషన్ రావటంతో చాలా బిజీ అయి పోతాడు. డ్రామాలో బాగా యాక్టింగ్ చేసిందని శృతిని అందరూ మెచ్చుకుంటుంటే, ఆమె కన్నతండ్రి చరణ్ రాక పోవడం తీరని వ్యధకు గురి చేస్తుంది పల్లవిని. పల్లవి మళ్ళీ గర్భవతి అయిందని తెల్సిన చరణ్‌కి లోగడ డాక్టర్ చెప్పిన విషయం గుర్తుకు వస్తుంది. అతని మనస్సు పరిపరి విధాల ఆలోచిస్తూంటుంది. పాపను కన్న పల్లవి ప్రాణం పోవడంతో చరణ్ పిచ్చివాడవుతాడు. ఇక శృతి పరిస్థితి వర్ణనాతీతం. పల్లవి మరణానికి శృతే కారణంగా భావించిన చరణ్, ఆపాప ప్రసక్తి వస్తేనే మండిపడుతుంటాడు. చరణ్ ఇప్పుడిప్పుడే కోలుకొంటుంటాడు. శృతి తన పనులు తాను చేసుకోవటమే గాక పాప పనులన్నీ తనే చేస్తుంటుంది. తమ ఎదురింట్లోకి క్రొత్తగా వచ్చిన గీతికతో పరిచయం పెంచుకొంటుంది శృతి. గీతికను ఆమె సవతి తల్లి చాలా హీనంగా చూస్తుంటుంది.

మొదట్లో— "ఈ పీడని ఎప్పుడు మూడు ముళ్ళు వేయించి వదిలించుకుందామా" అనుకునే రత్తమ్మ— ఇప్పుడు— "ఎక్కడ గీతిక పెళ్ళి చేసుకుని వెళ్ళిపోతుందో" అని భయపడసాగింది.

పెళ్ళి వాయిదా పడుతుంటే సంతోషిస్తోంది ఇప్పుడు!

గీతిక మేనమామ సంజయ్‌కి, గీతికంటే ఇష్టమే అదీగాక ఇప్పుడు తన స్నేహితులు కొందరు, పెళ్ళి చేసుకుని పొందుతున్న సుఖ, సౌకర్యాలను చూశాడు. అతడికిప్పుడు పెళ్ళి మీద మక్కువ కలగసాగింది. గీతికకి కూడా సంజయ్‌తో తన పెళ్ళి జరుగుతుందని తెలుసు. అందుకే అతడు రాంగానే సిగ్గుతో లోపలికి వెళ్ళిపోతుంది. పొంచివుండి— అతడి మాటలు వింటూ వుంటుంది. తన పేరు అతడు ఉచ్చరించినప్పుడల్లా ఏదో హాయిని పొందుతుంది.

ఇంట్లో పనీ, చికాకూ ఎక్కువగా వున్నప్పుడు పనంతా పూర్తి చేసుకుని, ఒక మూల కిటికీ దగ్గిర కూచుని, నీలాకాశంలోకి చూస్తూ, సంజయ్ గురించీ — తమ వివాహ జీవితం గురించీ కలలు కనేది.

మొదట్లో సంజయ్ వస్తేనే మొహం ముటముట లాడించుకుంటూ ఇంట్లోకి వెళ్ళిపోయేది రత్తమ్మ. కాఫీనీళ్ళు గూడా ఇచ్చేది కాదు. ఇప్పుడిప్పుడు కాస్త మర్యాద చేస్తోంది అతడిని.

సంజయ్ — బావగారితో, పెళ్ళంటే తన కున్న సుముఖత్వాన్ని చూచాయగా చెప్పడం ప్రారంభించాడు. అది గ్రహించిన వేదాంతం గారు భార్యతో అంటే— "అఁ! ఇంకా దానికి ఇరవై యేళ్ళేగా? ఈ రోజుల్లో ఆడపిల్లలకి ముప్ఫై దాటినా పెళ్ళిళ్ళు కావడంలేదు. దీని కప్పుడే ఏం తొందర?" అనడం ప్రారంభించింది ఆవిడ.

ఇంకోసారి —

"పెళ్ళంటే మాటలా? డబ్బూ దస్కం చూసుకోవాలి. కూడగట్టుకోవాలి. ఇంకా అవతల మనకి మగపిల్లలున్నారు — వాళ్ళ చదువులు — ఆడపిల్లల పెళ్ళిళ్ళూ — చిన్నదాని భవిష్యత్తూ. అన్నీ ఆలోచించండి" అంది.

"డబ్బంటూ వేమిటే? కట్నకానుకల ప్రసక్తి అవసరం లేదుగదే? ఏదో — ఒక

గుళ్ళో మూడు ముళ్ళూ వేయిస్తే సరి — ఇంక ఖర్చేముంది ?''

''ఎంత లేదన్నా రెండు — మూడువేలన్నా కావాలి ... అక్కర్లేదన్నాడని ... మరీ అంత లేని వాళ్ళలాగా చేస్తామా ... ? రేప్పొద్దున్న నవ్వుంటారు అందరూ. సవతి తల్లి ఏదో అయిందనిపించింది— అని !''

ఆయనేం మాట్లాడలేదు.

''అందుకని, ఈ ఏడు పై ఏడు, కొంత ఆగమనండి. ఏదో ఈ లోపల కొంత నిలదొక్కుకుందాం — లక్షణంగా చేద్దాం — సరేనా ?'' అంది. ఏ విధంగానయినా ఈ పెళ్ళి వాయిదాపడితే చాలు. అదేకావాలి ఆవిడకి.

సరేనన్నాడాయన.

ఆ మర్నాడే ఆవిడ కూతురు చంద్రిక పెద్దమనిషయింది. ఇంక రత్తమ్మ చేసిన హడావిడి అంతా ఇంతా కాదు. వెయ్యిరూపాయలు ఖర్చుపెట్టి పేరంటం, అదీ పెద్ద ఎత్తున చేసింది. చంద్రికకి పట్టుపరికిణీ, ఓణీ కొన్నది. పూలజడ వేసింది. పిలుపులకి గీతికె వెళ్ళింది. పేరంటంరోజు చెల్లెల్ని ముస్తాబు చేసింది గీతికే. పట్టుపరికిణీ ఓణీతో, తలంటుపోసుకున్న జుట్టు, పూలజడ ఎంత అందంతో వుంది చంద్రిక. చంద్రిక గీతిక కంటే అందమైనది. అది అందరూ ఒప్పుకునే సత్యం. పూలజడ ముందుకేసుకుని మెళ్ళో తల్లి వేసిన చిన్న కాసుల నెక్లెస్‌తో వయ్యారంగా కూచుంది చంద్రిక. ఆ రోజు అనుకోకుండా సంజయ్ వచ్చాడు.

''ఏమిటి—అంతా హడావిడుగా వున్నారు ?'' అన్నాడు గీతికతో.

''ఇవాళ పండుగ—'' అంటూ చిమ్మిరి అందించింది గీతిక.

ధైర్యంచేసి అతడి ముఖంకేసి చూసింది— ఆరోజే— ఎట్లాగో ఆ మాట మాట్లాడ గలిగింది అతడితో.

''వెరీ స్వీట్—'' అన్నాడు సంజయ్ చిమ్మిరి ముక్క నోట్లో వేసుకుని, గీతిక కళ్ళల్లోకి చూస్తూ !

ఆ మాటలో జల్లుమంది హృదయతంత్రి. తల వంచుకుని లోపలికి నడిచింది— సిగ్గుతో ముఖం కందిపోగా !

గీతిక ఇంకా కాసేపు అక్కడే వుండాలని అతడి మనసులోని కోరిక. కానీ— గీతిక లోపలికి వెళ్ళిపోయింది. నిస్పృహాయంగా కాసేపు అటే చూసి— కుర్చీలో కూలబడ్డాడు.

మరి కొంత సేపటికి పేరంటం ముగియడంతో చంద్రిక లేచి వచ్చింది. చంద్రికతో కబుర్లు చెప్పడం ప్రారంభించాడు. చంద్రికకి మామయ్యతో కబుర్లు చెప్పడం అలవాటే.

గలగలా మాట్లాడుతూ— హుషారుగా కబుర్లు చెప్తుంది ఎప్పుడూ గూడా ! ఇప్పుడూ అట్లాగే చెప్తోంది. అది చూసిన వాళ్ళెవరికీ ఎబ్బెట్టుగా లేదు. గీతిక కూడా అపార్థం చేసుకోలేదు.

కానీ—

కబుర్లు చెప్పుకుంటూ నవ్వుకుంటున్న వాళ్ళిద్దర్నీ - చూస్తున్న రత్తమ్మ మనసులో తళుక్కున ఓ ఆలోచన మెరిసింది ! అట్లాగే చూస్తూ తలపంకించిందామె.

చంద్రిక పూలజడ పట్టుకుని ఏదో అంటున్నాడు — సంజయ్. చంద్రిక పకపకా నవ్వుతోంది !

''ఈడూ — జోడూ ఎంత బావుందీ ? తేడా ఎక్కువయితే మాత్రమేం ? చెప్తేగానీ తెలీదు. పిల్లా ఎత్తరి ! బంగారం లాంటి పిల్లాడు. మంచి ఉద్యోగం —సాంప్రదాయక

మైన కుటుంబం — ఇటువంటి సంబంధం చంద్రికకి తేవడానికి తాము కొంచెం కష్టపడాలి ఇప్పుడు కాకపోతే - ఇంక ముందైనా దానికి పెళ్ళి చెయ్యాల్సిందే కదా? ఎప్పుడో చేసే బదులు - ఇప్పుడే చేస్తే - ముచ్చటగా వుంటుంది అన్ని ముచ్చట్లూ తీరుతాయి. ఇప్పుడే - ఈ సంజయ్‌కే ఇచ్చి చేస్తే - అది అన్ని విధాలా సుఖపడుతుంది ఇంత మంచి సంబంధం గీతిక కెందుకు పోనివ్వాలి! దానికి తగ్గది దానికి చూస్తే సరి! గంతకు తగ్గ బొంత దొరక్కపోదు.''



ఇదీ ఆవిడ ఆలోచన!

ఆలోచన రావడమాలస్యం — అమలులో పెట్టడానికి ప్రయత్నాలు ప్రారంభించేసింది అప్పుడే!

ఆ రోజు గీతిక బజారుకెళ్ళిన రోజు — సంజయ్ వచ్చాడు కాసేపటికి. రాంగానే నానా హడావిడి చేసింది రత్నమ్మ కాఫీ, టిఫిను స్వయంగా చేసి — చంద్రికచేత పంపించింది

చంద్రికని బాగా తయారుచేసి, 'కబుర్లు చెప్పు మామయ్యకి'ని పంపించింది. సినిమాకి తీసికెళ్ళమని అడగమంది చంద్రికకి సినిమా అంటే పిచ్చేగా? అడిగింది. తీసుకెళ్ళమని పట్టుబట్టింది కూడా!

పిల్లలందర్నీ కలిపి తీసికెళ్ళామనుకున్నాడు సంజయ్. కానీ రత్నమ్మ- ఎట్లాగో పిల్లలందర్నీ ఆపి- చంద్రికనుమాత్రమే సినిమాకి పంపించింది. తన పాచిక పారుతున్నందుకు అమితంగా సంతోషిస్తోంది ఆమె.

అందుకే ఆవిడ మంచి మూడ్‌లో వుంది. గీతిక నిజానికి ఆలస్యంగానే వచ్చింది. సగం శ్రుతీ వాళ్ళింట్లోనే లేటయింది రత్నమ్మ ఏమి తిడుతుందో అని భయపడుతూవచ్చింది. దానికి తగ్గట్టు పాప ఏడుపు బజార్లోకి వినిపిస్తోంది. ఆ రోజు పాప ఏడుపు కూడా సంగీతంలాగే వుంది రత్నమ్మకి! గీతికతో అందుకే అంత ఆప్యాయంగా- ప్రేమగా మాట్లాడింది!

## 19

ఆ తరువాత గూడా గీతికని తరచూ- మిగతా పిల్లలతో కలిపి- సినిమాలకీ- షికార్లకీ పంపించేది- రత్నమ్మ కావాలని! ఇది గీతికకి ఆశ్చర్యంగానే వున్నా- కాస్త ఆటవిడుపుగా వున్నట్టుంది ప్రాణానికి! అప్పుడప్పుడూ తమతో శృతిని గూడా తీసుకు వెళ్ళేది గీతిక

ఇప్పుడు గీతికంటే శృతికి ప్రాణం ఆమె మాట వేదవాక్కు! శృతికి గీతిక కొన్ని గౌన్లు వేస్తే మరింత అందంగా— ముద్దుగా వుంటోంది పారాడడం వచ్చింది శృతికి. రాజమ్మ వచ్చేసింది మళ్ళీ పనిలోకి ఇప్పుడిటు రాముకీ, అటు శృతికీ గూడా నిశ్చింతగా వుంది. పాప సంగతి ఇంక రాజమ్మదే! వస్తూనే శృతినీ - కృతినీ గుండెలకు హత్తుకుంది రాజమ్మ తినడానికేవేవో చేసి పట్టుకొచ్చింది శృతికోసం. ఇన్ని రోజుల కబుర్లూ గుక్కతిప్పుకోకుండా చెప్పేస్తోంది శృతి ఎంతో శాంతంగా, ఓపిగ్గా వింటోంది రాజమ్మ. అంతలో చరణ్ వచ్చాడు అక్కడికి—

"ఏం రాజమ్మా - బావున్నావా? మీ పిల్లలు కులాసానా?" కుశల ప్రశ్నలు వేశాడు.

రాజమ్మ అన్నిటికీ వినయంగా జవాబులు ఇచ్చింది. ఆమెకి ఆశ్చర్యంగానూ, సంతోషంగానూవుంది- చరణ్ అట్లా పలకరించడం— మాట్లాడడం!

"పాపా! నాన్నగారికి బాగైపోయింది కదమ్మా?" అడిగింది శృతిని, చరణ్ వెళ్ళాక.

అవునని తల వూపింది శృతి.

రాజమ్మకి గీతిక గురించి చెప్పింది శృతి. "ఆ ఆంటీ ఎంతో మంచిది రాజమ్మా" అని చెప్పింది.

గీతిక అమాయకంగా పిల్లలందరితో కలిసి ఆడుతూ, పాడుతూ, షికార్లకీ, సినిమాలకీ వెళ్తూ, ఎన్నడూ ఎరగనంత హాయిని అనుభవిస్తోంది. అదీ ముఖ్యంగా శని, ఆదివారాలు!

అదేమిటో! గీతిక అట్లా బయటికి వెళ్ళగానే సంజయ్ వచ్చేవాడు. వస్తూనే

గీతిక గురించే అడిగేవాడు. సమాధానం చంద్రిక ఇచ్చేది. అతడితో కబుర్లు చెప్పి కవ్వించేది — ఆడి — పాడేది. టిఫిను, కాఫీలు ఇచ్చేది. సినిమాకో, షికారుకో వెళ్దామనేది. దంతపు బొమ్మలాగా — అప్పుడే వికసిస్తున్న యవ్వనంతో — నవ్వుల జల్లులు కురిపిస్తూ, మురిపిస్తూ, వున్న చంద్రికను చూస్తే మనసు అప్పుడప్పుడూ వశం తప్పడం ప్రారంభించింది సంజయ్‌కి.

కానీ, వెంటనే ఆ మనసులోనే గీతిక ప్రతిబింబం ప్రత్యక్షం అయ్యేది. పట్టు తప్పుతున్న మనసుకి కళ్లెం వేసేవాడు.

అప్పుడప్పుడూ చికాకూ, విసుగూ కూడా కలిగేవి. "ఏమిటీ గీతిక? తనెన్నిసార్లు వెళ్ళినా, అసలింట్లో వుండదేం? ఉన్నా తనతో కలవదేం?" అనుకునేవాడు.

మనసు నదుపులో వుంచుకోవడం రాను రానూ కష్టంగా వుంటోంది అతడికి! దానికి తోడు — ఇప్పుడిప్పుడు గీతికను బయటికి పంపి 'గీతిక ఏది'—అని సంజయ్ అడిగితే —

'ఆస్పత్రికి వెళ్లింది' అని చెప్పడం ప్రారంభించింది — రత్తమ్మ.

మొదట ఒకటి రెండు సార్లు ఆవిడ ఆస్పత్రికి వెళ్ళిందన్నా అంతగా పట్టించుకో లేదు సంజయ్. రానురానూ — ఆస్పత్రికి ఎందుకెళ్లి వుంటుందా — అని ఆలోచించ సాగాడు. ఆ ప్రశ్నే రత్తమ్మని అడిగేశాడు గూడా!

"దానికి వంట్లో అంతగా బావుండడం లేదు — బాబూ! తరచూ జ్వరం, దగ్గూ వస్తున్నాయి. ఎందుకో — ఏమిటో అన్నీ పరీక్షలు చేయించాలని అనుకుంటున్నాము. మామూలు మందులకి తగ్గడం లేదు—మరి!" అంది ఆవిడ!

సంజయ్ జాలిపడ్డాడు. "అవసరమయితే నేను పెద్ద డాక్టర్ల దగ్గిరికి తీసికెళ్తాను. అన్ని పరీక్షలూ జరిపిద్దాం — " అన్నాడు సంజయ్.

"చూద్దాం — బలహీనతవల్ల కూడా కావచ్చు — " అందావిడ.

"ఎందుకయినా మంచిది కదా — పరీక్షలు జరిపించడం —" అన్నాడు.

'అదీ నిజమే' అంది రత్తమ్మ.

ఎప్పుడొచ్చినా గీతిక వుండేది కాదు. రత్తమ్మ ఇదే జవాబు చెప్పేది! ఈ సంగతు



లేవీ గీతికకి తెలియవు. గీతిక మామూలుగానే వుంది!

ఆ తరువాత కొన్నాళ్ళకి సంజయ్ తండ్రి పోయాడు— హఠాత్తుగా? సంజయ్ ఆ వ్యవహారాల్లో మునిగిపోయాడు గీతికని ఒక్కసారి మాత్రం తీసికెళ్ళి— మళ్లీ తీసుకొచ్చేశారు— రత్తమ్మ— వేదాంతంగారూను! కర్మకాండలకి రత్తమ్మ— వేదాంతంగారూ వెళ్లి వచ్చారు. అంతే!

ఆ తరువాత సంజయ్ అర్జంటు పనుల వలన— కొన్ని వూళ్ళు క్యాంపులకు వెళ్ళాల్సి వచ్చింది అందుకే చాలా రోజుల వరకు పిళ్లింటికి రాలేక పోయాడు. కానీ అతడు ఏవూళ్లో వుంటే ఆ వూర్కల్లా చంద్రికచేత ఉత్తరాలు రాయించేది రత్తమ్మ.

ఆ రోజుల్లోనే చంద్రికను అడిగింది రత్తమ్మ— "మామయ్యను పెళ్లి చేసుకుంటావా"— అని!

చంద్రిక ఆశ్చర్యపోయింది.

"ఏమిటీ— నేనా— మామయ్యనా? మరి— అక్కా?" అంది మనసులో ఏవేవో భావాలు మెదులుతుండగా!

"అక్కా లేదు— చెక్కా లేదు— నీ సంగతి చెప్పు— నీకు మామయ్యంటే ఇష్టమేనా— కాదా?"

"ఇష్టమేననుకో... కానీ..."

"కానీ లేదు — అర్ధణా లేదు. వెర్రి మొహమా— అక్క సంగతి నేను చూసుకుంటానుగా— నువ్వు మాట్లాడకుండా వుండు— సరేనా?"

"అయినా— అప్పుడే నాకు పెళ్లి ఏమిటే అమ్మా—"

"అవునే— నీదింకా చిన్నతనమే— కానీ— మళ్లీ ఇట్లాంటి సంబంధం రావద్దూ?" సర్దేసింది రత్తమ్మ.

చంద్రికకి మామయ్యంటే చాలా ఇష్టం. అదీగాక తను చదువుతున్న నవలల్లోనూ, ప్రేమ, సినిమాల్లోనూ జంటలే! అది చదివినప్పుడల్లా — చూసినప్పుడల్లా — మామయ్యే గుర్తుకొస్తాడు! మామయ్యతో కబుర్లు చెప్తుంటే చాలా బావుంటుంది. మామయ్య తన బట్టలనీ, నగలనీ, పొగుడుతూ చూస్తుంటే తన మనసు ఏవేవో లోకాల్లో విహరిస్తూంటుంది! కానీ, అక్షణం—ఇటూ

తిరుగుతుందనీ — మామయ్యే తన వాడే అవుతాడనీ—తను అనుకోలేదు.

మామయ్యతో తన పెళ్ళి! ఎంత మధురంగా వుంది! ఎంత చిత్రంగా వుంది? అద్దంలో తనను తను చూసుకుంటూ అనుకుంది— "అవును — తను అక్కకంటే అందగత్తె! సందేహంలేదు!" అని!

* * *

తన వ్యవహారాలూ, క్యాంపులూ ముగించుకుని, మూడు నాలుగు నెలల తరువాత వచ్చాడు సంజయ్. రాంగానే గీతిక కనబడింది అతడి కళ్ళకి.

"గీతికా, వంట్లో ఎట్లావుంది?" అడిగాడు సామభూతిగా చూస్తూ.

సరిగ్గా అప్పుడే గీతిక జలుబు భారంతో బాధపడుతోంది. కృతజ్ఞతగా చూస్తూ "బానేవుంది" అంది నవ్వుతూ.

వెంటనే లోపలికి వెళ్ళిపోయింది. అతడు ఇంకా ఏదో మాట్లాడాలని ప్రయత్నం చేస్తున్నాడు!

'అదేమిటో! గీతికతో మాటా డాలంటే మాటలే రావే -' తనలో తనే ఆశ్చర్య పోయాడు సంజయ్.

అంతలో చంద్రిక వచ్చింది — అక్కడికి. చంద్రికకి ఇప్పుడు మామయ్యని చూస్తుంటే అదో విధమైన భావం — సిగ్గు — సంకోచం వస్తున్నాయి. అయినా తల్లి ప్రోద్బలంతో ఇవతలికి వచ్చింది. ఎప్పటికన్నా అందంగా, ఆత్మీయంగా కనబడుతున్నాడు సంజయ్ — చంద్రిక కళ్ళకి! "మామయ్య అక్కని కాదు — తనని చేసుకోబోతున్నాడు!" అనే భావన చాలా హాయినిస్తోంది! అదే స్త్రీ ప్రకృతేమో!

# రాగలహరి

కళ్ళల్లో కొత్త మెరుపులు వచ్చాయి. పెదవులమీది చిరునవ్వుతో కొత్త అందం వచ్చింది. ఎన్నడూ లేనిది మాటి మాటికీ సిగ్గు పడుతోంది చంద్రిక. ఈ పద్ధతి కాస్త ఆశ్చర్యాన్ని కలిగించింది సంజయ్‌కి.

కాసేపయాక—ఏదో పనిమీద, చంద్రికని అవతలకి పంపించి — తను రంగ ప్రవేశం చేసింది రత్నమ్మ. గీతిక స్నానానికి వెళ్ళింది. కాఫీ, టిఫిన్లయ్యాయి సంజయ్‌కి.

"చూడు బాబూ! నీకో విషయం చెప్పక తప్పదు." మెల్లగా ప్రారంభించింది — రత్నమ్మ.

వింటున్నాడు సంజయ్—

"గీతికని పెద్ద డాక్టరుకి చూపించారు, మీ బావగారు. దాని ఆరోగ్యానికేం ఫరవాలేదు కానీ... కానీ... దానికి పెళ్ళి చెయ్యకూడదుట— వివాహ జీవితానికి అది అర్హురాలు కాదుట. ఈ విషయం నీకు మీ బావగారు చెప్పలేక నన్ను చెప్పమన్నారు—" కాసేపు ఆగింది.

సంజయ్ ముఖం నల్లబడింది.

"అవును నాయనా! నాకూ విచారంగానే వుంది. మీ ఇద్దరూ ఆశలు పెంచుకున్నారు. ఇప్పుడిట్లా అవడం నీకెంత పెద్ద షాకో నాకు తెలుసు అవతల... దానికెట్లా నచ్చ చెప్పాలో నాకు తెలియడం లేదు. పిచ్చిపిల్ల. దాని బాధ నేను వర్ణించలేను. సవతి తల్లినని, ప్రేమ లేదని, అనుకుంటారు కొంతమంది. కానీ నాకు చంద్రిక ఒకటీ, అది ఒకటీకాదు. ఇద్దరూ సమానమే. ఆమాట కొస్తే ఇదే ఎక్కువ, ఇంటికైన పెద్ద కూతురు గీతిక."

మాటని మధ్యలోనే ఆపుతూ—

"ఇంతకీ ఏం జబ్బంటారు డాక్టర్లు? నాకు తెలిసిన ఫారిన్ రిటర్న్‌డ్ డాక్టరు ఒకరున్నారు. ఆయనదగ్గిరికి తీసికెళ్ళిచూపిద్దాం, అక్కడ వాళ్ళేమంటారో—" అన్నాడు సంజయ్.

"చూడు నాయనా! నేనంటున్నానని ఏమీ అనుకోవద్దు. కానీ— ప్రతి డాక్టరుకి చూపించడం— ఆయన అదే మాట పదే పదే చెప్పడం దానికీ బాధ— నీకూ బాధ— మా అందరికీ బాధ— ఇప్పటికే మీ బావగారు ఇద్దరు— ముగ్గురికి చూపించడం అయింది. అందరూ అదే మాట!..." ఆగింది.

సంజయ్ మనసు అల్లకల్లోలంగా తయారయింది.

"నిన్ను చూస్తుంటే బాధేస్తోంది నాయనా! నువ్వొంటరిగా వున్నావు! భోజనానికి ఇబ్బంది. ఎందుకీ యాతన చెప్పు— నువ్వు కావాలనుకుంటే — సంబంధాలు రాక కాదు, ఏదో ఇన్నాళ్ళుగా అనుకున్నది కాకుండా పోతోందే అన్నబాధ వుంటుందనుకో —"

ఏమీ మాట్లాడలేదు సంజయ్—మనసంతా చికాకుగా వుంది.

(ఇంకా ఉంది)

# భవిష్యత్తును తలచుకుని బాధపడాలా మీరు?

ఒకసారి ఆలోచించి చూడండి.
సరైన తీరులో పథకం వేస్తే,
మీ వృద్ధాప్యంలో ఎంతో హాయిగా సరదాగా జీవించవచ్చు. ఒకవేళగాని మీరు అందుకు సంసిద్ధులు కాకపోతే మీకెన్నో చికాకులు, బాధలు ఎదురవుతాయి ఎందుకంటే, తగినంత డబ్బు లేకుండా రిటైరయిపోతే జీవితం గడపడం నానాటికీ మరింత కష్టం అనిపిస్తోంది గనక. అందుకే మీరెలాంటి పథకం వేయాలనుకున్నా అందుకు తగిన సమయం ఇదే.

నేడే రిటైరయ్యే సమయం కోసం పొదుపుకు ప్రణాళిక వేయండి. ముందు ముందు మీరు రిటైరయినప్పుడు, ఏ పని చేయనప్పుడు మీ మిగిలిన జీవితమంతా మీరు పొదుపు చేసిన సొమ్ము మీకు పనిచేసిపెడుతుంది. 30,000కు పైగా బ్రాంచీలు గల ప్రభుత్వ యాజమాన్య బ్యాంక్‌లలో ఎక్కడైనా సరే పొదుపు చేయండి—మీకు ఇష్టమైన రీతిలో రిటైరయిన తర్వాత హాయిగా గడిపేందుకు.



జాయింట్
పబ్లిసిటీ కమిటీ
ప్రభుత్వ యాజమాన్య
బ్యాంక్‌లు

మెంబర్ బ్యాంక్‌లు

అలహాబాద్ బ్యాంక్ • ఆంధ్రా బ్యాంక్ • బ్యాంక్ ఆఫ్ బరోడా • బ్యాంక్ ఆఫ్ ఇండియా • బ్యాంక్ ఆఫ్ మహారాష్ట్ర • కెనరా బ్యాంక్
సెంట్రల్ బ్యాంక్ ఆఫ్ ఇండియా • కార్పొరేషన్ బ్యాంక్ • దేనా బ్యాంక్ • ఇండియన్ బ్యాంక్ • ఇండియన్ ఓవర్‌సీస్ బ్యాంక్ • న్యూ బ్యాంక్ ఆఫ్ ఇండియా
ఓరియంటల్ బ్యాంక్ ఆఫ్ కామర్స్ • పంజాబ్ నేషనల్ బ్యాంక్ • పంజాబ్ & సింద్ బ్యాంక్ స్టేట్ బ్యాంక్ ఆఫ్ ఇండియా
స్టేట్ బ్యాంక్ ఆఫ్ బికనీర్ & జైపూర్ • స్టేట్ బ్యాంక్ ఆఫ్ హైదరాబాద్ • స్టేట్ బ్యాంక్ ఆఫ్ ఇండోర్ • స్టేట్ బ్యాంక్ ఆఫ్ మైసూర్
స్టేట్ బ్యాంక్ ఆఫ్ పాటియాలా • స్టేట్ బ్యాంక్ ఆఫ్ సౌరాష్ట్ర • స్టేట్ బ్యాంక్ ఆఫ్ ట్రావెన్కూర్ • సిండికేట్ బ్యాంక్
యూనియన్ బ్యాంక్ ఆఫ్ ఇండియా • యునైటెడ్ బ్యాంక్ ఆఫ్ ఇండియా • యునైటెడ్ కమర్షియల్ బ్యాంక్ • విజయా బ్యాంక్

**ప్రభుత్వ యాజమాన్య బ్యాంక్‌లు—మీ దైనందిన జీవితంలో ఎడతెగని బంధం, అనుక్షణం.**

Imageads-JPC-80312 D/TL

Eswar

# హైదరాబాద్ నోట్‌బుక్

తిరుమల రామచంద్ర

**సత్యం కార్టూన్లు :**

"నన్ను దేవుణ్ణి సహిస్తాను గాని, పంపినను సహించను. అందునా రాజకీయనాయకుల ప్రతాపాన్ని ఎవ్వరూ ముఖ్యంగా పత్రికా రచయితలు సహించరాదు. వ్యంగం వారికి వారి స్థానమేమిటో స్పష్టంగా చూపించాలి" అని శ్రీ నార్ల వెంకటేశ్వరరావు జనవరి 4న కళాభవన్‌లో శ్రీ సత్యం కార్టూన్ల ప్రదర్శనాన్ని ప్రారంభిస్తూ అన్నారు. ఈ ప్రదర్శనలో 120 కార్టూన్లున్నవి. మంచి రేఖా సౌష్ఠవంతో, ఇతివృత్తంతో ఆకర్షించాయి. ఈ ప్రదర్శనం ఆరు రోజులు జరిగింది.

**ఎగ్జిబిషన్ ప్రారంభం :**

ఎప్పటిలాగే ఈ ఏడు కూడా జనవరి 1వ తేదిన ఎగ్జిబిషన్ గ్రౌండ్సులో అఖిల భారత పారిశ్రామిక ప్రదర్శనం ప్రారంభం అయింది. ఇది సలభంగా రెండు నెలలపాటు ఉంటుంది. 1600 విక్రయశాలలు ఉన్నాయి. ప్రదర్శనను ముఖ్యమంత్రి శ్రీ అంజయ్య ప్రారంభిస్తూ, జిల్లాలలోను ఇటువంటి ప్రదర్శనలు ఏర్పాటుచేస్తే వివిధ రంగాలలో దేశం సాధించిన ప్రగతి ప్రజాసామాన్యానికి తెలుస్తుందన్నారు. ఎగ్జిబిషన్ సొసైటీ అధ్యక్షులు, మంత్రి శ్రీ బాగారెడ్డి స్వాగతం చెప్పారు. వినోద విజ్ఞానం కలిగించే ఈ ప్రదర్శనం నుండి ప్రజలు లాభం పొందాలి.

**ముఖ్యమంత్రి హితవు :**

ముఖ్యమంత్రి శ్రీ అంజయ్య జనవరి 6న అఖ్య దయ్య ప్రాథమిక విద్యాసంస్థ మహాసభకు అధ్యక్షపీఠం నుండి ప్రసంగిస్తూ, విద్యార్థుల నైతిక ప్రవర్తన పెంపొందడానికి చిన్ననాడే పునాదులు వేయాలని సూచించారు. పిల్లలను విద్యార్జన సమయంలో ఉత్తమ పౌరులుగా తీర్చిదిద్దే బాధ్యత ఉపాధ్యాయులదని ఆయన అన్నారు. పాఠశాలల్లో సందిన కార్యక్రమాలలో యోగాభ్యాసం తప్పనిసరిగా ఉండాలని ఆయన సూచించారు. దీనివల్ల పిల్లలు శారీరకంగాను, మానసికంగాను బలపడుతారని ఆయన అన్నారు.

**పోతన పంచ శత జయంతి :**

పోతన భాగవతం పంచశతజయంతి జరపడానికి వరంగల్ జిల్లా కలెక్టరు అధ్యక్షతన ఒక సంఘం జనవరి 3న ఏర్పడింది. శ్రీయుతులు దేవులపల్లి రామానుజరావు, బి. ఎస్. మాధవరావు ఉపాధ్యక్షులు. ఈ సంఘానికి అనుబంధంగా ప్రముఖ వ్యక్తులతో వివిధసంఘాలు ఏర్పడ్డాయి. రాష్ట్రంలోని విశ్వవిద్యాలయాల తెలుగు శాఖ అధ్యక్షులు సలహాదారులుగా ఉంటారు. ఆహ్వాన సంఘాధ్యక్షుడుగా మంత్రి శ్రీ హయగ్రీవాచారి ఎన్నికయ్యారు. విదేశాంగమంత్రి శ్రీ పి. వి. నరసింహారావు ప్రధాన పోషకులుగా ఉంటారు. వరంగల్లులో పోతన పరిశోధన కేంద్రాన్ని పోతన ఆడిటోరియంను నెలకొల్పాలని, పోతన తపాలాబిళ్ళ విడుదల చేయాలని, కాజీపేట రైలుస్టేషను పోతన స్టేషనుగా మార్చాలని, పోతన విగ్రహాన్ని నెలకొల్పాలని, పోతన ఉత్సవ సంఘం కార్యదర్శి ప్రొఫెసర్ డా॥ రామేశ్వర శర్మ కోరుతున్నారు.

**స్వరరత్న శ్రీరాములు :**

రాష్ట్ర గవర్నరు శ్రీ కె. సి. అబ్రహాం ఆధ్వర్యంలో డిశంబరు 31న శ్రీ తిరుమలశెట్టి శ్రీరాములుగారిని స్వరరత్న బిరుదంతో సత్కరించారు. ఈ సత్కారం ఇందిరా ప్రియదర్శిని హాలులో జరిగింది. శ్రీ శ్రీరాములు 30 సంవత్సరాలుగా ఆకాశవాణిలో తెలుగు నాటకాలు చదువుతున్నారు. ఆస్థానకవి శ్రీ దాశరథి, విద్యా శాఖ సహాయ మంత్రి శ్రీ ఎం. శ్రీనివాసరావు, గిరిజన సంక్షేమ శాఖ సహాయ మంత్రి శ్రీ రవీంద్ర నాయక్ శ్రీ శ్రీరాములుగారి మాధుర్యాన్ని, గాంభీర్యాన్ని ప్రశంసించగా, శ్రీయుతులు వై. రామప్రభు, కోటేశ్వరరావు, రామానుజాచారి పద్యసుమాలు కురిపించారు. శ్రీ శ్రీరాములు కృతజ్ఞత తెలిపారు.

**ఉప శ్రుతి :**

సంగీత నాటక అకాడమీని, సంగీత, నాటక, నృత్య అకాడమీలు విడివిడిగా విభజిస్తారట. విన్నారా? అనడిగారొక సంగీతాభిమాని. నేను సమాధానం చెప్పేలోగానే భజన అకాడమీని కూడా నెలకొల్పితే బాగుండునని అభిప్రాయపడ్డారు పక్కన ఉన్నవారొకరు. విడిగా భజన అకాడమీ ఎందుకండీ, ఇందుగలడందు లేడని ఎక్కడబడితే అక్కడ భజన చేసే విధం తెలిసినవారుండగా—అని మరొకరన్నారు.


Printed and Published by S. Nageswara Rao at the Andhra Patrika Press, Mallikarjuna Rao Street Gandhinagar, Vijayawada-3. Editor : S. Radhakrishna.

